# ఆంధ్ర సారస్వత

## వ్యాస మంజూష

సంపాదకులు

శ్రీ టి. బి. యం. అయ్యవారు M. A.,

ప్రథమాంధ్రోపన్యాసకులు

వీరశైవ కళాశాల, బళ్ళారి.

సర్వస్వామ్యములు
ప్రకాశకులవి

వెల రూ. 2—90 న. పై.

# కృతజ్ఞత.

అడిగినంతనే తమ అమూల్య వ్యాసముల నిందు చేర్చు కొనుట కనుమతించిన, రచయితలకును, పాఠ్య గ్రంథముగా నిర్ణయించి, ఆదరించిన విశ్వ విద్యాలయాధికారులకును కృతజ్ఞుడను.

— శ్రీ. బి. యం. అయ్యావారు.

సంపాదకుడు.

# విషయసూచిక.

---

# 1. రవీంద్రుని సౌందర్యాదర్శము

శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు

---

రవీంద్రుని పుట్టినదినము నేడు తొంబదిమూడు వంత్సరముల పూర్వము. ఇట్టిదినమందు వేసంగిలో జన్మించెను, రవీంద్రుడు. అబిడ్డ పెరిగి పెద్దవాడై తనసహస్రాధికములగు రచనలచే ప్రపంచ సాహిత్యసింహాసనమున ఆసీనుడు కాగలడని ఎవరు ఊహించిరి అతని కావ్యములు కీర్తి పతాకములై సాహిత్యాంబర వీధుల ఎగురుచుండగలవని జోస్యము ఎవరును చెప్పరైరి. ఉన్నతభావ శిఖరములు ఆ పతాకములశిరముల వహించి గౌరవాతిశయమున వెలయుచున్నవి. అట్టివిపులకీర్తి నార్జించిన జయంతి దినము నేడు.

రవీంద్రుడు మధురరసమూర్తి. సౌందర్యములచే పరివేష్టితుడై, శోభలనుధ్య పాలింపబడి, రసవాహినుల ప్రుంకులిడి ప్రకృతిపాత్రలో రూపసుధల గ్రోలిన భూలోకసురుడు స్వేచ్ఛావిహారుడై తనదివ్యానుభూతిని కావ్యప్రపంచమున వెదజల్లి వెడలెను. సౌందర్యాన్వేషణమే వాని అజన్మ దీక్ష. ప్రకృతిసాగరమున ఎగసి సమయు సౌందర్యవీచికల వెంటాడెను. జీవితపథమున రూపమృగతృష్ణికల ఆహ్వానమున పరుగులిడిన చిరపిపాసువు. సౌందర్యతీర్థముల సేవింపకోరిన నిత్యయాత్రికుడు. చిరపరిచిత దృశ్యములలో అభినవములగు శోభావైభవములు తిలకించిన మేధావి. ఉపేక్షితసన్నివేశములలో నూతనరసోత్కృష్టతను అనుభోగించిన రసజ్ఞుడు.

సౌందర్య మన నయనగోచరమగునదే కాదు. పంచేంద్రియములద్వారా ఉపలబ్ధమగు భావావేశము, రసోన్మత్తతయు సౌందర్యమే. మధుర సంగీతము, ఉల్లాసోద్దీపకములగు సౌరభములు, విభిన్నరసవత్తరములగు రుచులు, మృదులలితశిరీష పేశలస్పర్శానందములును సౌందర్యమంజరిలోని రసప్రసూనములే ఊహాలోకమున కలితలావణ్యములచే కవిరసహృదయము సంతుష్టిపొందనేర్చును. స్వప్నసీమల అలౌకిక సౌందర్యమూర్తుల లాస్యముచే తన్మయత్వమును పొందనోపును. పూర్వానందముల స్మృతిసాగరమున తేల్చి తరంగాగ్రములఇంద్రధనుఃప్రభల రీతి చూడనోపును.

సౌందర్యభోగము సూత్రబద్ధమైన సిద్ధాంతము కానేరదు. కాలస్థితివ్యత్యాసములచే రుచి,అరుచి యగుటయు శ్రావ్యమగునది కఠోరమగుటయు మనకు విదితమే. విరహవేదనోపాలంభములే యిందులకు తార్కాణములు. సంయోగయామినీసుధలే విరహనిశీథినీవిషయములై భాసించుచున్నవి.

సౌందర్యభోగము విశిష్టమైన మనోవైఖరిపైనను చిత్తసంస్కారముపైనను. రసగ్రహణకౌశలముపైనను ఆధారపడును. కవితాహృదయతీరముల ఆనందతరంగములు చుంబనమొనర్చుచుండును. ఆ ఆనంద మీకళానైపుణ్యమున వాక్కులలో కవిత్వముగను స్వరములలో సంగీతముగను రేఖావర్ణములలో చిత్రలేఖనముగను హావభావ విలాసభంగిమవిన్యాసములలో నృత్యముగను పరిఢవిల్లుచున్నది. అది యొక అలౌకికానుభూతి. స్వర్గవిపులసుఖరాశిని సూక్ష్మముగా ఉపలబ్ధినొందుటే సౌందర్యసిద్ధి. బాహ్యవస్తువులకన్న అంతరంగికాత్మవిలసనమే సౌందర్యా

నుభూతి బాహ్య రామణీయకత నిమిత్త మాత్రమే. అట్టి అపార సౌందర్యానందగోళముల సృజించుకొని నిత్యవిహారియై అక్షరరమ్యతను అనుగమించు భావశబలతను, శబ్దాతీతమగు ఊహాలను మధురస్వరాంచలస్పర్శచే పులకిత మొనర్చు గీతోన్మత్తతను ప్రకటించి, దీర్ఘకాలము శారదారాధనగావించిన సౌందర్యోపాసకుడు రవీంద్రుడు.

మనప్రాచీన కావ్యవాహినులు ఆరణ్యక సౌందర్యసంపదలకు ప్రణమిల్లియే ప్రవహించెను. మన పురాణనాయకులు శ్రీరాముడు, పాండువులు, నలుడు, హరిశ్చంద్రుడు, దుష్యంతుడు, వనవిహారులే కావచ్చును. కాననప్రవాళ పర్యంకముమీదనే సౌందర్యము జన్మించెను కాబోలు! సౌందర్యోపలబ్ధికై అరణ్యవాసము అవశ్యకమాయెను. ఏబదిసంవత్సరములు దాటనవారు వానప్రస్థాశ్రమమును స్వీకరించుట శ్రేయమని ఆర్యసంప్రదాయము. కాని రవీంద్రుడు యువజనులే అడవులకు వెళ్ళి· అచ్చటి అందచందముల అనుభవించుట యుక్తమని చమత్కరించెను.

నిజరసానుభూతిని కేవలము వ్యక్తిపరము చేసికొని అనుభవింపక, విశ్వవ్యాప్తమొనర్చి విశ్వజనానందముగనో, దుఃఖముగనో రవీంద్రుడు వర్ణించెను. అందువలననే అది సర్వజనతార్ద్రితావహముగను అనంద హేతువుగను వెలయుచుండును. స్వానుభవములలో విశ్వసౌందర్యమూర్తి నికాంచును. తనహృదయతంత్రులను విశ్వవిపంచికాతంత్రులలో శ్రుతిచేసికొని గానము చేయును. అందువలననే అది దేశకాలముల నతిక్రమించి జగత్సామగ్రియై యొప్పుచుండును.

సౌందర్యమునకు అల్పాయువను అభిశాపమును ఏ భగ్న హృదయు; శాశ్వత విరహిణి యొసగెనో, ప్రకృతి సౌందర్యములు దీర్ఘకాలముండునని కావు. సూర్యాస్తమయ వర్ణవైచిత్ర్యములు ఉషాదేవిరాగకపోలరమ్యత, విద్యుత్ చకితకటాక్షవీక్షిత, తిమిరాంభల వికసింపజేసి తోడనే అంతర్ధానమగుచున్నవి. పైవాశీర్వాదమున పుష్పమునకు స్వల్పాయుర్దాయము మాత్రమే యనియు, లావణ్యాదళిములు మాయను నెలగోడుచు మానసము కాగలవనియు, సౌందర్యమును బంధించి యుంచ జాలమనియు అది కేవలము ఇంద్రధను:కాంతిప్రసూనపరిమళము, తరంగములకు ఈడుజోడై చంచలమైన దనియు, వారి భావన. ఒక్క ప్రభాతమున అనంత జీవితము ప్రస్ఫుటింపగలదనియు, సాగరమున క్షణకాలమున అనంతభావములుజనించి చిత్తము ను రసవంతముగ చేయుననియు వారి హృదయము, నిత్యసలాయ వాసక్తము సౌందర్యము.

క్షణభంగురమగు సౌందర్యవిరహమునే ప్రకృతిలో కాంచుచున్నాడు రవీంద్రుడు. సౌందర్యపరిపూర్ణతను పొందిన ఊర్వశిని ఉషోదయ సమయమున అనవకుంఠితవు, అనుంతతవు యనియు, అపూర్వశోభన భువనమోహిని అనంతవిలాసిని వనియు సంబోధించి, క్షీరసాగర మథనకాలమున దేవదానవులకు కాన్పించిన నీమనోహర సుందరరూపము ఇప్పుడు మానవులకు కాన్పించుచుండుట లేదని.

"మరలిరాదు, మరలిరాదు
అస్తమించెను ఆగౌరవశశి
అస్తాచలవాసిని ఊర్వశి."

అని వాపోవుచున్నాడు.

> అయినను జాగ్రత మైయుండును
> ఆశ ప్రాణాక్రందనముల

అని ఓదార్పును పొందుచున్నాడు.

మాయమైన సౌందర్యరీతుల మరువని చిరవిరహి రవీంద్రుడు.

> "అయ్యో పోయిరి వానితోడి
> ఆదినముల ఆపౌరాంగనలు
> నిపుణిక చతురిక
> మాళవికల బృందము."

అనియు,

> ఎవరిని కలియ లేదో
> ఆసకలవరాంగనలు
> విచ్ఛేద దుఃఖమున నన్ను
> అన్యమనస్కునిగ చేసిరి...

అనియు కాళిదాసు కాలపు నాయికలగూర్చి చెప్పుచున్నాడు. కాని వెంటనే ఓదార్చుకొని...

> చావరు బాబూ నిపుణికా
> చతురికలు శోకమున
> వారందరు మారుపేరులతో
> ఉన్నారు మర్త్యలోకమున

అని సంతసిల్లుచున్నాడు.

సౌందర్యము భ్రమింపజేయు శక్తి గలది. ఆసౌందర్య మృగతృష్ణల దాటినగాని నిరలంకారసత్యము స్పష్టముకానేరదు. ప్రభాతారుణవర్ణదీప్తి సౌందర్యమై కన్పట్టును. రక్తమావరణను ఛేధించి ధవళశుభ్రతయందు సముజ్జ్వలమగును సూర్యరశ్మి. మోహావేశమున ప్రేమారంభము. మోహవిముక్తతయే ప్రేమసిద్ధి. సాధనమొనర్చుయోగికి ప్రథమమున భ్రాంతిమనోహర మాయరూపములో కాన్పించిన తదుపరిభూషణవిహీన దేహమున, లోపలను బయటను దివ్యదీప్తిని ప్రసరింపజేయుచు సత్యదర్శన మొసగును... అని స్వీయచరిత్రను ప్రకటింపని చిత్రాంగద విషయమై అర్జునుడు తలపోసికొనెను.

రమ్యమైనది కొన్నివేళల హానిని కొనితెచ్చును. సౌందర్యము, సంగీతము, నృత్యము అభినయము, చిత్తవికారమును జన్మింపజేయవచ్చును. దైవాంశసంభూత మగునని అమృతపానము చేయించుటకు మారు విషపాత్రను అధరములకు అందించును. సౌందర్యానలము దగ్ధమొనర్చి దగ్ధమగుచుండును సుఖదుఃఖములకు ఆస్పదమైనవి సౌందర్యములో అనుభోగ్యములగు ఫలములు, నిషిద్ధములగునవి అందే జన్మించెను. అందుననే సౌందర్యము, భగవంతుని మరపింపజేయునని సౌందర్యపరాఙ్ముఖులైరి కొందరు దైవభక్తులు. సౌందర్యమునుండి దృష్టిని మరల్పుడని హెచ్చరించిరి. కాని రవీంద్రుడు నిర్భయముగా... వైరాగ్యసాధనచే కలుగు మోక్షము నాకు వలదు అనిచాటెను.

నా ప్రపంచము నీసౌందర్యశిఖనుండి శతప్రదీపికల వెలిగించుకొని.

"నీ మందిరము చుట్టు నుంచగలదు
పంచేంద్రియ ద్వారముల నేను బంధింపను
దృశ్యశ్రవ్యత్వానందములు నీ
ఆనందము నే వహింప గలవు."

అని వైరాగ్యవేదాంతము నెడల విముఖత్వము చూపెను. సౌందర్యానుభూతిద్వారా రసమయ జీవితమును గడిపెను. కళాకారుడగు రవీంద్రుడు. సౌందర్య కమలములతో శోభిల్లు రస కాసారము వారిజీవితము. అమృతమానస సరోవరక లస్వనములలో స్వర్ణనళినీకోరకముల మెసవు కవిరాజ హంస రవీంద్రుడు.

దశదిశలనుండి జలములు సేకరించుకొన్న నది సముద్ర విలీన మగుమాడ్కి సౌందర్యనిర్ఝరములన్నియు రూపాతీతమగు పరిశాంతసత్యసింధువు వైపునకే వెడలుచున్నవని రవీంద్రుని మతము.

అరూపరత్నాశచే
రూపసాగరమున
ఈదుచున్నాను...

అని గీతాంజలిలో నివేదించెను. సకలజీవకోటుల ప్రాణములు మహామరణపారావారమున సంగమించు రీతి...

నానాస్వరముల ఆకులధారలు
తన్మయత్వమున మిళితము కాగా
సమస్తగానము సమాప్తమగును
నీరవపారావారమున.

అని వారి విశ్వాసము. సౌందర్యయవనికాభ్యంతరమున భావించుచున్నది సత్యసంహాసనము. రసవీచికాఘాతములు వాని రిమ్యపాదములు.

సౌందర్యము యౌవనముతో బాంధవ్య మేర్పరచుకొన్నది. తారుణ్యా మనుపింఛమునువిప్పి సౌందర్యమునాట్యమును చేయు చున్నది. పంచమస్వరమున రాగోద్దీపనాకూజితముల చేయుచున్నది. బాల్యమున వార్ధక్యమున సౌందర్యము కుంటు పడును. యౌవనఘటిత కనుకనే అకుంఠిత, అనిందిత, పూర్ణ ప్రిస్ఫుటితయగు సుందరి రూపసి యౌవనను ఊర్వశి. ఆమె రూపలావణ్యములలోనే సంతుష్టిచెందుచుండిరి కామరహితులగు స్వర్గవాసులు. మానవ శరీరమునందే ముఖ్యముగ యౌవన దేహవల్లరియందే సౌందర్యము పరాకాష్టము పొందునని వారి అభిమతము. కవితా వస్తువగు జవ్వనినిగూర్చి...

"సగము మాత్రమే మానవివి నీవు
సగము కల్పనవు"

అని అర్ధదైవత్వము వారికి నొసగి దేవిని చేసెను.

రవీంద్రుని కావ్యములలో అంగవర్ణన లుండవు. స్త్రీ స్వభావమును నిశితముగ వర్ణించును. నారీకటాక్షమృగ యూవినోనముల హృదయరంజకముగ వర్ణించును. శృంగారము ధ్వనితమగుచుండునే కాని, నూపురశింజిత నర్తకియై విలోల కల్లోలమురీతి గంతులిడదు.

ధ్వనిప్రధానములు వారి కావ్యములు. ఋతుప్రశస్తి వారి కావ్యములలో విస్తారముగ కాన్పించుచుండును.

వర్షర్తువుపై వారికి అభిమానము మెండు. రెండవది వసంతము ఋతువులకు ఉచితమగు ప్రత్యేక రచనల చేసెను. మధురమైన గీతికల పాడెను.

"ఆరుగురు సేవాదాసులు ఆరుఋతువులు
ఏతెంచి చుట్టుముట్టి నృత్యమొనర్తురు"

అని విలాసనర్తకులుగా ఋతువుల పోల్చెను.

"అదో వచ్చెఅదో అతిభైరవహర్షమున
జలసేచితక్షితిసౌరభ అహ్లాదమున
దిగ్వధూచిత్తహర్షము
ఘనగౌరవమున వచ్చివేసెను మత్తవర్షము"

అనియు,

గురుగురు మేఘములు తిరుగుచు తిరుగుచు
గర్జించుచున్నవి గగనగగనమున
నాహృదయము నృత్యముచేయుచున్నది నేడు
మయూరము మాడ్కి నృత్యముచేయుచున్నది"

అనియు వర్షసమాగమోల్లాసమును ప్రకటించెను.

అనంత ప్రవీణమగు వసంతవనపుష్పరాజముల ప్రియ సఖిదనముగ ఊహించుచున్నాడు.

"ఆవిరజాజి, ఆవకుళము
ఆచంచలచకితచంపకము
స్మితశుభ్రిముఖులు
తరుణిపరిమళమాధవి
ఉల్లాస ఉత్సుక ఉన్నమిత
అత్యంతకుతూహలిని."

పువ్వులపలికించి తుమ్మెదలపిలిపించి వెన్నెలల ఒలకించి తీవ కన్నియల కులికించి చిగుర్చుతోటలలో వసంతుని సన్మానించెను తాండవగతికేతులే ఋతువులు.

శోకమునందును మరణమునందును రవీంద్రుడు సౌందర్యమును కాంచెను.

గతించిన భార్యనుగూర్చి...

"మృత్యునేపథ్యమునుంచి
మరల ఏతెంచితివి
నూతనవధూవేషమున
హృదయవివాహమంటపమునకు".
"నీవు నాజీవితమున
కలిపితివి మృత్యుమాధుర్యమును
నాజీవితదిక్చక్రిసీమలు
పొందినవి అపూర్వమహిమల
అశ్రుధౌతహృదయాకాశమున

కాన్పించుచున్నది దూరస్వర్గపురము
నీవు కళ్యాణరూపిణివి
మరణమునే మాంగళ మొనర్చితివి
మృత్యురహస్యమనోహరగృహమున
వాతాయనమున గూర్చుండియున్నావు.”

వేదన సుధారస మనియు వర్ణించెను. శ్మశానసింహాసనమున తిమిరమకుటముతో మృత్యుదేవతను రాణివలె చూచి సల్లాపించిన కవిరాజు రవీంద్రుడు. రాణివెంట రాజు చనెను. వాని కావ్యశాసనములచే రక్షింపబడి పోషింపబడు అనురక్త ప్రజలమగు మనము మిగిలియున్నాము.

---

# 2. అభిజ్ఞాన శాకుంతలము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

భారతములోని కథను కాళిదాసు మార్చుటను గూర్చి మున్ను చెప్పబడినది. ఇందు ప్రధానమైన మార్పు దుర్వాసుని శాపము. ఈ ఒక్క శాపముతోడనే కాళిదాసుని కథయంతయు మారిపోయినది. భారతములోవలె దుష్యంతు డెచ్చట నబద్ధ మాడినవాడు గాలేదు. తన మనస్సులో తనకుఁ దెలిసిన విషయమును ప్రకృతిజనులవలని భయమువలన గాచికొని వృథావిడంబనము చేయలేదు. ధీరోదాత్తుడైన నాయకుడైనాడు. కాళిదాసుని దుష్యంతుడు ప్రకృతిజనులవలన భయపడువాడు కాడు. ఆయన రాజర్షి. అంతఃకరణ ప్రవృత్తి నిత్యజాగ్రదవస్థయందున్నవాడు. ఆయనకట్టి భయములేదు అతడు మహార్షికల్పుడు. అందుకనియే 'సాక్షాత్ప్రశ్యామీవ పినాకినమ్' అని సూతుడనుట. ఈ భావమే సర్వజనులయందు వ్యాపించి యున్నది.

భారతకథలో నైదారేండ్లు దాటిన సర్వదమనుని వెంటబెట్టుకొని శకుంతల భర్తృదర్శనార్థము వెళ్ళినది. ఆ రేండ్ల కాలములో దుష్యంతుడీ కథను మరచి పోయినను మరచిపోయి యుండవచ్చును. ఇచ్చట నట్లుకాదు. శకుంతల భర్త మొద్దకు పోవువరకు నెలలుకూడ నిండలేదు. నాలుగైదు నెలల గర్భవతి కావచ్చునేమో. ఈ యయిదు నెలలలోనే మరచి పోవుట కెక్కువ సావకాశము లేదు.

మొదటి కారణము నాయకుని ధీరోదాత్త లక్షణము. నమ్మృషావాదిత్వము సంపాదించుటకు కల్పింపబడిన శాపము. రెండవ విషయముచేత శాపముయొక్క గాఢ లక్షణము సమర్థింపబడినది.

ఈశాపము హఠాత్తుగా సంభవించినదా? ఆకాశము నుండి యూడిపడినదా? ఒక మహాకవి యెప్పుడును హఠాత్తుగా దేనిని ప్రవేశపెట్టను. అట్లుప్రవేశపెట్టుటచేత వేఱుప్రయోజనమున్నచోఁ జేయవచ్చును. ప్రయోజనము కంటె నౌచిత్యముండవలయును. ఆప్రతికూలదైవమే ఈశాపముగా పరిణమించెను. ఈసంగతినే రాజుచేత "అపిసన్నిహితోఽత్ర కులపతిః" అని ప్రశ్నింపబడి, వైఖానసుఁడు "ఇదానీమేవ దుహితరం శకుంతలా మతిథిసత్కా రాయ సందిశ్య దైవ మస్యాః ప్రతికూలం శమయితుం సోమ తీర్థం గతః" అని చెప్పినాడు. ఈ రీతిగా ఆ శాప కథకు ప్రథమాంకమునందే, దుష్యంతుడు శకుంతలా దర్శనము చేయక ముందే బీజప్రక్షేపము జేసినాడు.

సరే ఆమెప్రతికూలదైవమును శమింపఁజేయుటకు సోమతీర్థమునకు కణ్వుడు వెళ్లెను. ప్రతికూలదైవము శమించునదేగాని పూర్తిగానివర్తితమగునదికాదు. ఇది దైవముయొక్క లక్షణము. దాన జపాది శాంతికర్మలచేత ప్రతికూలదైవముయొక్క తీవ్రతను తగ్గించవచ్చును. దైవమును పరిహరించరాదు కణ్వునంతటి మహర్షి దాని నుపశమింపజేయుటకు మాత్రమే సమర్థుడయినాడు.

ఆ ప్రతికూలదైవముయొక్క లక్షణమెట్టిది?

ఈ నడుమ నొకానొక యాధునిక విమర్శకుడు అభిజ్ఞాన శాకుంతలములోని శకుంతలా దుష్యంతులవివాహమును గూర్చి యొక యాక్షేపము చేసినాడట. 'దుష్యంతుడు వయసుమళ్ళిన వాడు. శకుంతల చిన్నది. ఇది అసమవయస్కుల నడుమ

వివాహము. ఆధునికులకు రుచించదు' అని. మన యాధు నికులకు పూర్వగ్రంథములలో నున్నది ఏది రుచించుచున్నది గనుక ఇది రుచించ లేదన్న విచారము? మన దేశములో నొక వానుడిగలదు. 'ముప్పది యేండ్ల పురుషుడు, మూడేండ్ల యూడది' అని. ఇది పూర్వుల భావము. దీనిలోని యవార్థ్య మిచట చెప్పుట యనవసరము. లోకమును చక్కగా పరిశీలించినవారి కిది యే సమంజసమని తెలియగలదు. కౌంట్ టాల్స్టాయ్ కొన్ని చిన్ననవలలు గూడ వ్రాసినాడు. వానిలో 'ఫామిలీ హాపినెస్' అను నొక చిన్న నవలగలదు. ఆ కథలో తండ్రి చనిపోయిన యొక పదునాఱు పదునేడేండ్ల బాలిక తానే సంసారమునకు పెద్దదైతన తండ్రి స్నేహితు నొకడు తన్నుగూడ రాగా నతనిని ప్రేమించి వివాహము చేసికొనెను. ఇట్టి సంయోగమునందు కుటుంబసౌఖ్యమున్నదని టాల్స్టాయ్ యొక్క యుద్దేశ్యముగదా: ఆయన మహాత్మునకు గురువువంటివాడు. అట్టి పరిణత మేధావంతుల యభిప్రాయముల నర్థము చేసికొనలేని యాధునికుల యూహలలోని సామంజస్యము వారికే తెలియ వలయును. దీనిని వదలిపెట్టి మరియొక రీతిగా విచారణ చేసినచో, శకుంతల వయస్సువిచారణీయమగుచున్నది. ఆమె మేనకా విశ్వామిత్రుల సంతానము. మేనకా విశ్వామిత్రుల కథ యేనాటిది? ఈ కథ రామాయణమునందున్నది దుష్యంతుడు రామచంద్రునకు గూడ పూర్వుడా: శకుంతల వయస్సెంత? యెవ్వరికిని తెలియదు. ఆమె పూర్వయుగమునాటి స్త్రీ. రేవతీ బలరాముల సంబంధమువంటి సంబంధమిది. ఆధునిక చరిత్రకారుల లెక్కలనుబట్టి సర్దినచో సర్దవచ్చునేమో గాని, పురాణములయందున్న కథాక్రమమును బట్టి, కాలక్రమమును

బట్టి, సర్దుటకు ఇది వీలు లేని విషయము. దుష్యంతుని వివాహము చేసికొనువఱకు నామెయొక్క బాల్యావస్థ బాల్యావస్థగానే యుండునన్న వరమునామె కెవరైననను గ్రహించిరో, దుష్యంతుడామెను చూచునాటికి నామెకు సుమారు పదునారేండ్లున్న వను కొన్నచో బదునారేండ్లకు పూర్వమే కణ్వుడు పసిబిడ్డగానున్న శకుంతలను మేనకచేత పరిత్యక్తమైన స్థలమునందు చూచెను. అనగా కొన్ని వేల యేండ్లు వేలయేండ్లేమి లక్షలయేండ్లు శకుంతల శిశువుగానే అచ్చట పడియుండెనని యర్థము చెప్పకొనవలయును దీనిని బట్టి విచారించినచో, పూర్వకథ లాధునిక విమర్శనా సూత్రముల కందవు. ఇదంతయు నిట్లున్నను, శకుంతలయొక్క ప్రతికూలదైవము చక్కగా కన్పించుచున్నది. వెనుకటి యుగములో జన్మించి యొక్క ఋషికి దొరికి యెన్ని వేల యేండ్లో కన్యగానుండి వివాహముకాకయున్న విచిత్రమైన యొక జీవి శకుంతల ఆమె గర్భమున నొక మహాపురుషుడు పుట్టవలయును అతని పేరున నీ దేశము పిలువబడవలయును. అమె కారణ జన్మురాలు.

ఇన్ని యేండ్లనుండి తన యాశ్రమమున నున్న శకుంతల యొక్క ప్రతికూలదైవము నుపశమింపజేయుటకు కణ్వుడు సోమ తీర్థమున కిప్పుడే యేల వెళ్ళినాడు?

అమెకు దైవము ప్రతికూల మెప్పటినుండియా? వేల యేండ్లనుండి. కణ్వుడు మహర్షి. భగవంతుడు. అనగా అగతానగతాదుల పరిజ్ఞానము గలవాడు. శకుంతలకిప్పటికి దైవ మనుకూలమైనది. వివాహము జరుగు వేళ వచ్చినది. కాని కొంత ప్రాతికూల్యముపశమింపజేసినచో నామె సంసారముసుఖముగా

నుండును. కణ్వుడు తొందరపడినాడేమో చెప్పలేము. మరి రైదేండ్లాగినచో నీ ప్రాతికూల్యము గూడ నుండెడిదిగాదేమో ఉపశమింపచేయ నక్కరయే యుండెడిదిగాదేమో. శకుంతలా జాతకముతో కలిసి మరియొకని జాతక మున్నది అతడు జన్మించ బోవు భరతుడు. అతడు తొమ్మిది నెలలలో జన్మించి తీరవల యును. అతని కైదేండ్లు వచ్చువఱకును తల్లిజాతకము బాగుగా లేదు అప్పటికైనను బాగుపడదేమో! కణ్వుడుసోమతీర్థమునకు వెళ్ళి దాని నుపశమింపజేసెను. అందుచేత నైదేండ్లలో బాగుపడినది.

ఇప్పుడు శాపప్రసక్తి. ఆపద లనేకవిధములుగావచ్చును అవి యిట్లు వచ్చునని యెవ్వరికిని తెలియదు. గ్రహచారము నెవ్వడును మార్చలేడు. శకుంతల యొక్క జాతక మట్టిది. ఆమెకు మంచి దినములు. వివాహమైగర్భవతి కావలసినరోజులు. వెంటనే భర్తృవిరహము. అయిదారునెలలైన తరువాత సంబంధమే విచిన్నమైనదా అన్నస్థితి నాలుగైదేండ్లు అప్పటి నుండి యథార్థముగ మంచి దినములు.

ఇది యామె జాతకము. కొడుకైన భరతునకు సుమారు నాలుగైదేండ్లు వచ్చినతరువాత నామెకు మంచి దినములు. కణ్వుడు సోమతీరమున తద్దైవము యొక్క ప్రాతికూల్యము నుపశమింపజెయుట చేత జరిగినది. లేనిచో నా ప్రాతికూల్యమెట్లు శాధించెడిదో తెలియదు. శకుంతల సన్యాసిని కావచ్చును ఆమె మరణించవచ్చును. భూవివరమునందు ప్రవేశించవచ్చును. మనకు తెలియదు. భరతుడు దుష్యంతునకు దొరకుట వేఱు వారు శకుంతల చనిపోయిన తరువాత మారీచమహర్షి భరతుని

దుష్యంతుని వద్దకు పంపించి 'వీడు నీ కొడుకు, శకుంతలను నీవు తిరస్కరించితి' అని చెప్పి పంపించియుండవచ్చును. అప్పుడు దుష్యంతునకు జ్ఞప్తి కలుగవచ్చును. దుష్యంతుడు భరతుని నిస్సందేహముగా స్వీకరించెడివాడు. భరతుడు చక్రవర్తి లక్షణోపపన్నుడు గనుక. దీనికి క్రింది వాక్యములు సాక్ష్యములు. శకుంతలాతిరస్కారము జరిగిన తరువాత పురోహితు డిట్లన్నాడు గదా.

'అత్ర భవతీతావదాప్రసవాన్మమ గృహేతిష్ఠతు। కుత ఇదముచ్యత ఇతిచేత్ త్వంసాధుభి రాదిష్ట పూర్వఏవ। ప్రథమం చక్రవర్తినం జనయిష్య సీతి। సచేన్మునిదౌహిత్రః తల్లక్షణోపపన్నో భవేత్, తతః ప్రతినన్ద్య శుద్ధాంత మేనాం ప్రవేశయిష్యసి। విపర్యయే పితు రస్యా స్సమీపగమన ముపస్థిత మేవ.'

ఈ మాటలకు రాజు 'యథా గురుభ్యో రోచతే' అన్నాడు.

అందుచేత శకుంతలకే దైవము ప్రతికూలముగా నున్నది. భరతునకుగాదు. దానినే కణ్వు డుపశమింప జేసినాడు ఆదే కణ్వుని తపశ్శక్తి. పైగా ఆ కణ్వునకు శకుంతలమీాద ఎంత ప్రేమ? ఆమె నత్తవారింటికి పంపించుచు కన్నులకు నీళ్ళు తెచ్చుకొన్నవాడు. నోటమాట రానివాడు. కడుపున కన్న తండ్రులెట్టి తన యావిశ్లేష దుఃఖముల ననుభవింతురో అంత యనుభవించినవాడు.

ఆ దైవముయొక్క ప్రాతికూల్యము చాల పెద్దది హతాదాపతితమైనది. మరియు శకుంతలా స్వభావ సముద్గత మైనది. పరమేశ్వరుడైన కాళిదాసు దైవమునకు వ్యాఖ్యానము చేసెను. భావ్యమును విరచించెను. దైవప్రాతికూల్య మనగా మనయంతట మనము చేసికొన్నది. శకుంతల దుష్యంతని విష్ట బుద్ధియై, వాకిటి ముంగిలికి వచ్చిన దుర్వాసుని చూడలేదు. నీ కామము ధర్మానుబంధిగా నుండవలయును. అమెయొక్క దుష్యంతగత చిత్తవృత్తి శృంగారరసమునకు దోహదము గాని తత్కాల సమాపతిత ధర్మాచరణ ప్రతిబంధక మైనది ఇది సృష్టిలోని రహస్యము. ఇది ధర్మములోని రహస్యము దైవము యొక్క రహస్యము. ఇవియన్నియు నొకదానియు నొకటియను స్యూతములైయుండును. వానిని విడబఱచి చూచుటయు నాచరించుటయు ఋషులు చేయుదురు. తదితరులు కర్మాధీను లగుదురు. ఆ కర్మయే దైవము. ఇది వేద ధర్మ రహస్యము. దీనిని కాళిదాసు వ్యంగ్యముగా తన కథాంశముల యందు నిక్షేపించినాడు.

మరియు నిందింకొక్కవిశేషముగలదు. శకుంతల యొక్క పరధ్యానము, తత్ఫలితమైన శాపము, వాని యంతట నవి యప్పుడే సముద్భవించలేదు శకుంతల పుట్టిననాటినుండియు నున్నవి. ఇదియంతయు ననాదినుండియు పూర్వపూర్వోద్దిష్ట మైనవై యుత్తరోత్తర కాల విసృతములై యుండును. అందు చేతనే, ప్రతికూలదైవము నుపశమింపజేయ, కణ్వుడు సోమతీర్థమునకు వెళ్ళుట. మొదలయినవి పూర్వోక్తము లైనవి. కాళిదాసు సర్వవేదగత ధర్మకర్మ సమూహ రహస్య పరిష్కార సిద్ధాంతవేత్త. అందుచేత నీ కథ నిట్లు కల్పించినాడు.

ఈ దైవప్రాతికూల్యముయొక్క బలవత్తరమెట్టిది? దానికుపశమమెంతవరకు జరిగినది? దాని లక్షణ మేమి?

దాని లక్షణ మెట్టిదనగా నది హఠాత్సంభవము కాదగినది. మిక్కిలి బలవత్తరమైనది. అందుచేతనే సులభకోపుడైన దుర్వాసు డతిథిగా వచ్చెను. అది యెంత బలవత్తరమైనదనగా, ప్రియంవద ఇట్లన్నది. 'యదానుసీతోపి నివర్తితుం నేచ్ఛతి తదా విజ్ఞాతో "మయా" అనునీతుడైగూడ తిరిగి రానన్నాడు దైవప్రాతికూల్యమంతటిది. శాపము శాపముగా నుండి పోవలసినదే. ఆ దైవప్రాతికూల్య మంతటిది కాని, కణ్వుడు దాని కుపశమనము చేసినాడు. ఆదైవ ప్రాతికూల్యమును ఆ యుపశమనమును కాళిదాసెంత విచిత్రమైన వ్యంగ్యముతో నిరూపించినాడు? ఆ దైవముయొక్క ప్రాతికూల్యముయొక్క యపహార్యత్వ మెంత విచిత్రముగా నిరూపించినాడు? అనసూయ దుర్వాసుని ప్రసన్నునిచేసికొనుటకు పూలగిన్నె తీసికొనిపోవుచున్నది. ఆమె కాలుజారి పూలగిన్నె క్రిందబడినది. పూలన్నియు విరియజల్లబడినవి. మరల నామె పూవులన్నియు ప్రోగుచేసినది. పూలు విరియజల్లబడుటతో శాపానుభవము తప్పదనియు, మరల ప్రోగుచేయుటతో శాపమునకు నిష్కృతి లభించుననియు నర్థములు. ప్రియంవద దుర్వాసుని దగ్గఱకుపోయి మరల తిరిగివచ్చినది. ఆమెయిట్లన్నది. 'ప్రకృతి వక్రుడైనవాడు ఎవరు బతిమాలినను ఒప్పుకొనడు. కాని కొంచెము మెత్తబడినాడు' అన్నది. అప్పుడనసూయ ఆయన విషయములో నిదేగొప్ప. తరువాత చెప్పుము, చెప్పుము అని, యన్నది.

ఈ ప్రసంగముచేత శకుంతల యొక్క ప్రాతికూల్యదైవము కణ్వుని యొక్క సోమతీర్థ గతోపశమన తపఃప్రభావముచేత కొంత తగ్గిన లక్షణము తెలియుచున్నది. అంతటి ప్రాతికూల్య మేదో కొంత తగ్గినది. అంతవరకేసరిపెట్టుకొనవలయు నన్న మాట.

దుర్వాసుడను గ్రహించినాడు. 'నమేవచనమన్యథా భవితుమర్హతి। కింత్వభిజ్ఞానాభరణ దర్శనేన శాపోనివర్తిష్యతే అని. ఈ యనుగ్రహలక్షణమెట్లున్నది. ఇతిమన్త్రయన్నే వాన్తర్హితః. ఇచట రెండువిషయములున్నవి. అభిజ్ఞానాభరణ మొకటి యున్నదని దుర్వాసున కెట్లు తెలియును? అతడెందు కనెను? అతడును ఋషియే. ఆ ప్రాతికూల్యదైవమే దుర్వాసో ఋషిరూపమున వచ్చినది. ఈ యభిజ్ఞానాభరణ మా దైవము నకు తప్పకుండ దెలియును ఇది యొక విచిత్రమైన సృష్టి. ఈ ప్రపంచకము గిజిగానిగూడు. ఆ గూటిలక్షణము తెలిసి కొని విరచించుట మహాకవిశక్తి.

అనుచునే అంతర్ధానము పొందినాడు. మరల నీ యంత ర్ధానము పొందుటలో నర్థమున్నది. అంతర్ధానము పొందినాడు గనుక ప్రియంవద మరలనేదియో యడుగుటకు వీలులేదు. మాటలనుచునే యంతర్ధాన మగుటలో నా యంగుళీయకము రాజునకు చూపించుటకు సులభముగానుండి. శచీతీర్థ మున కన్పించకుండపోయినది. హఠాత్తుగా పోయినది. తెలిసికో లేకుండపోయినది, మన్త్రయన్నే వాన్తర్హితః అన్నదానిలో నిదియర్థము.

కొందరు కేంళ ప్రశ్నను చెప్పుదురు. ముఖ ప్రశ్నలు చెప్పుదురు. పృచ్ఛచేయువాడు నిలుచున్న వైఖరినిబట్టి, అడిగిన లక్షణమునుబట్టి, స్వరమునుబట్టి, ముఖాది వికారము లనుఁబట్టి ప్రశ్నలకు సమాధానముఁ జెప్పుదురు. ఆవేళయందు గ్రహసంపుటిని గుణించినను ఫలిత మదియేవచ్చును. ఇదివఱకు చెప్పితినిగదా. ఇవి యన్నియు నొకదాని కొకటి పెనవేసికొన్న విషయములని. ఈసృష్టిగతమైన, ఈ విలక్షణమైన పరిస్థితులను కావ్యములయందు రసదృష్టులైన మహాశిల్పులు వివరింతురు.

ఇది శకుంతలాదైవ ప్రాతికూల్య కథ



# 3. ధర్మవరంవారి నాటక ధర్మములు

శ్రీ ఖండపల్లి లక్ష్మీరంజనంగారు.

ఆంధ్రనాటకపితామహ బిరుదాంచితులైన ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు తెలుగునందు స్వతంత్రనాటక రచనకు అరుణుని వంటివారు. కోలాచలము శ్రీనివాసరావు గారు రామకృష్ణమాచార్యులవారికి సంవత్సర మాత్రావరులైన సమకాలికులు. వీరును స్వతంత్ర నాటకరచనకు గడంగిరి శ్రీనివాసరావుగారు ప్రధానముగ చారిత్రక నాటక ప్రియులు. ధర్మవరమువారు చారిత్రకనాటకములవైపు ఎక్కువ మొగ్గ లేదు. పూర్వగాథలనుండి రసాత్మకములైన కథా వస్తువులను స్వీకరించి. సర్వరసపోషకములైన రూపకములను వ్రాయుట చేతనే వీరి రచనలు నిఖిల జనామోదము నంది, వీరికి 'ఆంధ్ర నాటక పితామహ' కీర్తి లభించెను.

నాటక వస్తు వెచ్చటనుండి గ్రహించినను దానిలో అలంతి యలంతి మార్పులు గావించి సరి క్రొత్త కథాసంవిధానముగ భాసింపచేయ గల్గుటలో ధర్మవరమువారు సిద్ధహస్తులు. ఈ యంశమున వీరు ప్రపంచ నాటక కర్తలలో స్థానము పొంద దగినవారు. అట్లు కావించిన కథాకల్పనచే ప్రత్యేకరూపనంత మైన పాత్రసందోహమును సృష్టించుటయు వీరి విశిష్టప్రజ్ఞ. పటి ష్ఠమై, ఉక్తిప్రత్యుక్తి రూపమైన వేగసంభాషణలు కూర్చుటయును నాటకపితామహుని కళావిశేషము. ఆంధ్రవాఙ్మయములో విరళ విరళముగా నుండినహాస్యరసమునకు తమ నాటకములలో సము

చిత్స్థాన మిచ్చుటయు వీరి వైలక్షణ్యము నాటకాంశగత మైన హాస్యము వేఱు పరిహాసముకొఱకే బయలుదేరిన వీరేశలింగము పంతులుగారి ప్రహసన నాటకములను వేఱుగా గుర్తింపదగును పూర్వనాటకములందు స్వగతము అనువిధాన ముండినను అది యల్పప్రచారకమై, అల్పప్రయోజనవంతమై యుండెను. ధర్మవరము వారు దీనిని విపులీకరించి ఆంగ్లనాటకములందువలె ఆత్మసంభాషణములను (Soliloques) తెలుగు నాటకముల ప్రవేశపెట్టి, దాని కెన్నియో నాటకీయప్రయోజనములు కల్పించిరి. ఇదియు వీరివిశిష్టతకు నిదర్శన మనవొప్పును. నాటకము చేసద్యః ప్రీతి నేకాక నీతిబోధయు కావించి సంఘసంస్కరణమునకు బీజములు వైచుట వీరి ప్రగతిదృక్పథమునకు తార్కాణము. ధర్మవరము వారికి నొరవడి కాదగిన సంస్కృతరూపక సాహిత్యమునందెచ్చటను 'ఉత్తరరంగము' అనునాటక ప్రక్రియ లేకున్నను వీరు దీనిని ఆంగ్లమందలి (Epilogue) భరతవాక్యపద్ధతి ననుసరించి, తెనుగున కవతరింపజేసి చక్కగా వాడుకొనిరి ఆంగ్లనాటకములందువలె అంకములందు రంగవిభజన చేయుటకు గూడ వీరు మార్గము చూపిరి.

కృష్ణమాచార్యులవారు సంప్రదాయజ్ఞులైనను సంప్రదాయదాసులు కారు. సంస్కృతనాటక పద్ధతిప్రకారము నాందీ ప్రస్తావనాదులను పాటించుటయు వీరి కిష్టము. ఆలంకారికులయును శాసనమునకు విరుద్ధముగ వధాదికమును రంగస్థలముపై ప్రదర్శించుటకు వీరు వెనుదీయలేదు. ఆంధ్రనాటకక్షేత్రము నందపూర్వ సాహసమునకు లోనయి ఆచార్యులవారు కష్టాంతనాటకవిధానమును గూడ మనకు చవిచూపించి

ధన్యత నొందిరి. ఆంగ్లనాటకములలో పరిచితమైన 'నాటకీయ ప్రతిఘర్షణము' (Dramatic Irony) వంటి చమత్కృతులను వీరు చక్కగా గమనించి తమరచనలలో లెస్సగా ప్రయోగించిరి. ధీరోదాత్తులనే కాక ధీరోద్ధతులను ధీరశాంతులను నాయకులుగా సృష్టించి, నాయకకల్పనమునందొక యపూర్వ రీతికి వీరు ప్రవర్తకులైరి. అభిజ్ఞానమణిమంత నాటకమునందలి కుంభీనసుడును, పాంచాలీ స్వయంవరమున శకునియు, స్త్రీ పాత్రిలలో చిత్రాంగి, మంథరలును ఈ శ్రేణికి చేరినవారు. అద్భుతరససన్నివేశములను సృష్టించుటలో ఆచార్యులవారికి శక్తియు రక్తియు మెండు. పాత్రిలు మారువేషము ధరించి, సుదూరము కథ నడపుటను 'ముక్తావళి' యందు వీరు ప్రవేశపెట్టిరి. కృష్ణమాచార్యులుగారు గ్రాంథిక భాషావాది యని ప్రసిద్ధి. నీచపాత్రిములకు వ్యవహార భాషను వాడుట వీరను మతించినట్లు లేదు. ఐనను నీచతరపాత్రిలచే వారి ప్రత్యేకమైన వ్యావహారికమునందు మాట్లాడించిన ఘట్టములు. కలవు చిరకారి చిత్రనళీయములు భారత మూలములు. చంద్రహాసకథ జైమిని భారతమునుండి గ్రహింపబడినది. రుక్మాంగద, ప్రహ్లాదనాటకములు భాగవత మూలములు. సారంగధరనాటకము అర్ధచారిత్రకము లేదా చరిత్రాభాసము. చిరగారి నాటకబీజము భారతమునుండి గ్రహింపబడినను కథా సంవిధాన మంతయు వీరి కల్పనయే. ముక్తావళియందు ఆంగ్ల నాటక ప్రతిధ్వనులు బాగుగ కలవు. వైష్ణవాగ్రేసరుడైన రామకృష్ణమనీషి రామాయణమూలమైన నాటకమును తన చరమకాలమువఱకును తలపెట్టకుండుట వింతగనేతోచును. పాదుకాపట్టాభిషేకము వీరి జీవితాంతమున వ్రాయబడినట్లు నిరూపింపనైనది. వాల్మీకియెడ వీరి కపారగౌరవము. ప్రాచేతసుడే

మొట్టమొదటి కష్టాంతకథా రచయితయని వీరు సంభావించిరి. రామాయణ కథనుగూర్చి వీరికి కొన్ని సందేహాస్థానము లుండెను. వాని నన్నింటిని మథించి తత్సార భూతముగ నీ నాటకమును గ్రథించితి మని ప్రస్తావనయందు సెలవిచ్చియుండిరి. ఇది నిక్కముగనే వీరి పరిణతప్రజ్ఞకు కేతనముగా నలరారుచున్నది. పద్యములు సులభశైలిలో గలవు. వచనమునకే ప్రాధాన్యము. ఆత్మపరీక్ష, చిత్తవిశ్లేషణము, ఉత్తమ పాత్రనిర్మాణ చాతురి మున్నగు ప్రశస్తనాటక ధర్మములిందు చక్కగా ప్రతిభాసించుచున్నవి.

ధర్మవరమువారి నాటక శిల్పరీతులు బహుముఖములై సంభావ్యములైయున్నవి. కథా సంవిధానచాతురి వీరి విశిష్టలక్షణములలో మిన్న యని నుడివియుంటిమి. వీరు పూర్వవృత్తములనే కథా వస్తువులుగ తీసికొనియుండిరి గదా. ఇక కథాసంవిధాన వైచిత్రి యెక్కడిది? అని శంక జనింపనచ్చును. వీరి పూర్వకథలనే కాయమానముగ అంగీకరించినను దాని మీద ప్రాకించిన నూతన కల్పనాలతలచే నదియొక విలక్షణ సృష్టియై ఆకులు పూవులు పిందెలు కాయలతో నలరారుచు కన్నుల పండువై వెలుగొందును. సావిత్రి చిత్రాశ్వమును తిలకింతము. మూలకథయందు చిత్రాశ్వుని తండ్రియైనద్యుమత్సేనుడు కన్నులు లేనిచీకునలె మాత్రమే మనకు గనుపించును ఈ నాటకమునందాచార్యులవారు ద్యుమత్సేనున కగ్రస్థానము కల్పించిరి. నాటకారంభమున సాళ్వపురి ముట్టడింపబడు సన్నివేశము కల్పించిరి. ఘుటకేతుడనురాజు సాళ్వపురిపై దండెత్తి, స్వల్పసైన్యపరివృతుడైన ద్యుమత్సేను నోడించి

యాత్రని చెరపెట్టి కూర్చుండై కన్నులు తీయించెను. వృద్ధరాజు కుమారుడు చిత్రాశ్వుడు ప్రతాపశాలి. కాని యాతడీ యదనున తండ్రికడ లేక మేనమామలవద్దకు పోయియుండెను. ఈ ప్రయాణముయొక్క ప్రయోజనమును నాటకకర్త చక్కగా వినియోగించుకొనెను. ద్యుమత్సేనుడు కుమారుని తీసుకొని వచ్చుటకై పంపినసుమాలి యనువిదూషకుని వలన తండ్రిపాటు నెఱిగి చిత్రాశ్వుడు సాళ్వపురికి పరుగెత్తెను మార్గమునందశ్వపతి నగరము మీదుగ పోవలసి వచ్చుటయు, అచ్చట కాంతారత్న మైనసావిత్రిని యాదృచ్ఛికముగ చూచుటయు, నాయికా నాయకు లన్యోన్యానురాగరసనిమగ్నులగుటయు కవి చిత్రించెను. సావిత్రి సత్యవంతుని ప్రేమించె ననుమాటయె కాని అది యెట్లు ఎన్నడు సిద్ధించెనో భారతమునందు కాని యెక్కడగాని లేదు. సావిత్రీ సత్యవంతుల ప్రణయరంగమును కల్పించనిచో వారి జీవితమునందలి ప్రగాఢస్నేహము నిరాలంబముగ నుండి యుండును. ఈ యనకాశమును గైకొని కృష్ణమాచార్యుల వారు రమణీయమైన శృంగారరసఘట్టమును తీర్చిరి. మృదువైన హాస్యమును ప్రవేశపెట్టిరి. సావిత్రియు, ఆమె చెలికత్తె యుత్ప లయు మద్రపురిప్రాంతోద్యానముల విహరించుచుండును. చిత్రా శ్వునిచ్చట చూడకముందు సావిత్రి యింటికి పోవుటకు తొందర పడుచుండును.

సావి:—ఉత్పలా! మా తల్లిదండ్రులున్నచోటు కదలి కడుదూ రము వచ్చితిమి. సాయంకాలమగుచు వచ్చెఁగదా?

ఉత్ప:—అయిన నేమి? యిప్పుడే పోవుదము. ఈ వినోదము లెప్పుడు చూడవలెను.

ఉత్ప— సావిత్రి! కడు దూరము వచ్చియున్నార మింక బోవ్రుదము.

సావి— తాళవే, పోవుదము. త్వర యేమి?

ఉత్ప— ఇంతకు ముందు నీవే నన్నుఁదర్వ పెట్టుచుంటివే.

సావి— అప్పుడు సాయంకాల మగుచున్నట్లు తోఁచి యట్లంటిని.

ఉత్ప— అప్పుడు సాయంకాలముగా నుండి నీ పాలిటి కిప్పు డుదయ మైనదా?

ఈ నాటకమునందు సుమాలి యనువిదూషకుని పాత్రి సృష్టించుటలో కృష్ణమాచార్యుడు గొప్ప భావజ్ఞతను ప్రదర్శించెను. వీరి నాటకములలో ఇంకెచ్చటను విదూషక పాత్ర యున్నట్లు కనబడదు. సుమాలి పరిహాసోక్తు లాడుచున్నను విదూషకమాత్రుఁడు కాడు. కార్యజ్ఞుడు. సాహసికుడు, ఉక్తిచతురుడు, చదువరి. వీని వాక్యములందొక గాంభీర్యము, కొంటెతనము, తత్త్వజ్ఞత్వము గాన్పించును. సుమాలి విదూషకుడా? వేదాంతియా? యని శంక జనించును. షేక్స్పియరు యొక్క 'లియరు రాజు' అను నాటకమునందలి విదూషక పాత్రి నీ సుమాలి పోలియున్నాడు. విషాదాంతవాతావరణమందీతని వ్యంగ్యహాస్యము అదొక సాంద్రఘనాఘనచ్ఛాయను ముసురు కొనునట్లు చేయును.

ప్రమీలార్జునీయమునందు నాటకకర్త సున్నితమైన హాస్యకల్పన చేసెను. యుద్ధ రంగమునందు స్త్రీపురుషులు ప్రతిపక్షమునందున్నచో నెట్టి రమ్యపరిణామము సిద్ధించునో దీనియందు కవి చమత్కారముగ కల్పించెను. సత్యరాజా పూర్వదేశయాత్రలయందు వీరేశలింగము పంతులుగారు ఆడ మళయాళము సృష్టించి కీర్తిగడించిరి. కృష్ణమాచార్యులవారి ప్రమీలార్జునీయమును ఇట్టిదే. ఈ కవిపుంగవులలో మున్ముందీ హాస్యకల్పనము నెవరు చేసిరో కనుగొనవలెను. ఒక్కయంశము మాత్రము సత్యము. పంతులుగారి హాస్యమునందు కటుకషాయరుచి కలదు. స్త్రీరాజ్యమునందు పురుషుల దురవస్థను చిత్రించి. స్త్రీలను గౌరవింపవలెనని సమకాలికులకు బోధింపఁ జూచిరి. నాటక పితామహుడును నీతిబోధను ఉద్దేశించెను. కాని ఆ మార్గము వేరు. దానియందు అపహాస్య వ్యథాబీజములు లేవు. చిత్తవికాసము కల్గించునే కాని వీరి హాస్యము చిత్తసంకోచము కలిగించదు. ప్రమీల సేనాను లైనసుందరుల ముఖసందర్శనము చేయగనే సాత్యకివంటి యోధులెల్లరును అస్త్రసన్న్యాసము చేసి ప్రేమపాశబద్ధులై కాంతామృదు ప్రహారములకు లోబడుట హృదయరంజకముగ నుండును ప్రణయవిషయములో పురుషులు మాకు దాసులని స్త్రీలోకము గర్వసంరంభము చెందకుండుటకు గాబోలు ఆచార్యులవారు ప్రమీలయె యర్జునునికొఱకు విరహవ్యథ పడుచున్నట్లు మనోహరముగ చిత్రించిరి. అర్జునుడు భీరుడగుట చేతనో, అథవా షష్టిపూర్తి యెన్నడో జరిగిన యువశిఖామణి యగుటచేతనో నూవుగింజంత యైన చలింపక స్త్రీలోకముపై పగ తీర్చుకొనెను.

పాంచాలీ స్వయంవరమునందు వస్త్రైక్యమును సాధించుటకై యాచార్యులవారొక క్రొత్త మార్గము త్రొక్కిరి. లాక్షాగృహదాహము, గంధర్వవిజయము, బకవధ, మత్స్యయంత్రభేదనము మొదలగు కథా భాగముల నొక్క నాటక సూత్రములో గ్రథించుటకు వీ రెంతయో కృషి చేసిరి. ఇవి యన్నియు పాండవ సంబంధివృత్తములే కదా! వీనిని జోడించుటలో శ్రమ యేమి అని పైపై చూపులకు తోచును. కథా నాయకు లొక్కరైనను కేంద్ర భావన యొక్కటి యవసరమని నాటకకర్త భావించెను. పాండవుల పక్షమునం దిది సాధింపరాక వారి ప్రతిపక్షులైన కౌరవుల వంకకు మరలిరి. పాండవుల కష్టములన్నిటికి మూలసూత్ర మచ్చట నున్నట్లు వీరు కల్పింపదలచి శకుని పాత్రను భారత కథలోకన్న మున్ముందు ప్రవేశపెట్టిరి. వీరి చేతిలో శకుని యొక విశిష్ట రూపమును దాల్చెను. వీని పన్నుగడ లద్భుతములు. లక్క యిల్లు కాల్చినదోషమును పురోచనునిపై పెట్టుటతో తృప్తిపడక లక్కయిల్లు కట్టించిన దోషము కౌరవులపై రాకుండ శకుని కల్పించిన యుక్తి అద్భుతావహము. తన శిల్పనైపుణ్యమును ప్రదర్శించుటకై లక్కయిల్లు కట్టుదు నని పురోచనుడే యనుజ్ఞ వేడినట్లొక కపటపు ఉత్తరము నీతడు సృష్టించెను. ఏకచక్రపురమునందు పాండవుల కాశ్రయ మిచ్చిన బ్రాహ్మణుని కుమారుడు పసివాడని భారతమునందు కలదు. ఈ నాటకము నందీతడు సాముగరిడీలు నేర్చిన యువకుడు భీముని కాగని ఈ యువకుడే బకునకు అన్నపు బండి తోలుకొని పోవును. కుంతీ పుత్రులలో నొకనిని రాక్షసున కాహారముగా పంపుట కంగీకరించిన కళంకము ఆ బ్రాహ్మణునకు

లేకుండ చేయుటకై నాటక కర్త యీ మార్పు చేసియుండును. ఐనను ఈ నాటకమునందు ఏక నాయకత్వము కృష్ణమాచార్యుల వారే తలపోసి ఉత్తర రంగమునందిట్లు పలికించిరి.

'అలర పాంచాలీ స్వయంవర నామ
విలసితం బీకథ వింటిరి గాదే
తనరు నీ చరిత కథా నాయకుండు
అనిలజుండే యౌనో, యర్జునండగునో
మఱి యటుగాక కుమ్మరిగుండఁగునో'

బృహన్నల నాటకమునందు అర్జునుని లోకోత్తర గుణ విభూషితునిగా చిత్రించుటకై ఆచార్యులవారు యత్నించి కృత కృత్యులైరి. పాండవులు విరాటుని కొలువు ప్రవేశించుటతో నీ నాటక మారంభింపవలసి యుండెను. కాని యర్జునుని జితేంద్రి యత్వమును ప్రతిపాదించుటకై నాటక కర్త ఊర్వశీ వృత్తాంత మును ప్రస్తుత కథకు దూరముగా నున్నను ఇందు సంఘటిత పఱచిరి. ద్రౌపదిని తనకు గూర్పుమని కీచకుడు బృహన్నలను కోరుట దీనిలో నొక క్రొత్త కల్పన. కీచకుని కామాంధతయు, బృహన్నల యవస్థా దౌర్గత్యమును సూచించుటయు ప్రయోజన ములై యుండును. ఉత్తరాభిమన్యుల పెండ్లియైనట్లు భారత ములో కలదు. కాని వారి ప్రణయమునకు పూర్వరంగము లేక పోవుటచే అది యంత హృద్యముగా లేదు. నాటక కర్త యీ లోపమును పూరించుటకై మురిపె మగు ప్రణయ సన్ని వేశమును కల్పించెను.

ఇట్లు కథాసంవిధాన ఘటనయందు ధర్మవరము వారెన్నియో మెలకువలను ప్రదర్శించిరి. స్త్రీపురుషుల చిత్తవృత్తి రీతులను విశ్లేషించి చూపుటను వీరే తెలుగు నాటకములందు మొట్టమొదటివారు. యత్నించి అనితరలభ్యమైన విజయము సాధించిరి. వీరి సారంగధర నాటకమే దీని కుజ్జ్వల నిదర్శనము. ప్రేమకును, విఫలమైన ప్రేమ తామసప్రకృతులయందు పుట్టించు ప్రతీకారపరత్వమునకును, జరుగు అంతరసంఘర్షణమును దీనియందద్భుతముగ చిత్రింపబడినవి. షేక్స్పియర్ నాటకము ఆథెల్లో యందు ఇయాగో అనుపాత్రవలె నిర్హేతుక ద్వేషము గలచిత్తవృత్తులును లోకమునందు గల్గునని చంద్రహాస నాటకమునందలి కుంభీనస పాత్రమూలమున వీరు వెల్లడించిరి. దుష్టునకుగూడ ఏదో ప్రయోజన ముండక పోదు. దురంతరాజ్యాభిలాషయే కుంభీనసుని కార్యప్రవృత్తికి మూలము. నాటకీయ ప్రతిఘర్షణము దీనియందు కొట్టవచ్చినట్లు చూపించిరి. చంద్రహాసుని పాములచే కరపింపబోయి కుంభీనసుడు విషాంగములను తన ప్రియపుత్రునిపై వీడుచుటయే దీనికి లక్ష్యము. పాదుకాపట్టాభిషేకమునందలి మంథరపాత్ర స్త్రీలోకములో కూడ పరమదౌష్ట్యము కలదనుటకు తార్కాణముగు చున్నది. ఈ కుటిలురాలు మానవద్వేషి చిత్తవృత్తికి ఆద్యోదాహరణము కాగలదు. మంథరమనస్సునందు భరతునియెడ ద్రోహము గల్గు టొక విచిత్రసన్నివేశము. అమావాస్య చీకటిలో మిణుగురుపురుగు వెల్తురు.

విషాదాంతనాయకులను సృష్టించుటలో నీ కవికిప్రజ్ఞమెండు. మానవహృదయమునందు సుచిచేష్టలు, ధర్మా

ధర్మములు కలిసిపోయి విచిత్రసమ్మేళనము నొందుటని నాటకకర్త బాగుగా గ్రహించెను. ఈ సత్యముచే వీరు ప్రహ్లాద నాటకమునందు హిరణ్యకశిపు పాత్రలో అత్యుదాత్తముగ చిత్రించిరి. లోకకంటకుడైన హిరణ్యకశిపుడు భార్యయైన లీలావతిమెడ శిరీష పేశలుడు. కడుపార గన్న కుమారుడైన ప్రహ్లాదునికడ వెన్నముద్దకన్నను మెత్తనివాడు. కాని మరతికి ప్రాణీయమైన యహంభావ మాతని తల కెక్కియుండెను. అది విష్ణుద్వేషరూపమునొంది యీ మహాపరాక్రమశాలి మరణమునకు కారణ మయ్యెను.

కృష్ణమాచార్య కవిరచనమునందు అల్పదోషములు లేకపోలేదు. వీరికి శబ్దాలంకార ప్రీతి హెచ్చుండినను ఈ గుణము మొదటి నాటకములందే యెక్కువ కాన్పించుచున్నది కొన్ని స్థలములందు కల్పనాదౌర్బల్యము కలదు. చిరకారి నాటకమునందలి ప్రధానకథ యంతయు వీరి స్వీయకల్పనమే. ఈ చిరకారి వృత్తాంతము మాత్రము భారత ప్రసిద్ధమయినది. దీనియందు పౌరాతన్యమైన వాతావరణము సహజము. ఈ నాటకమునందు వేశ్యావృత్తిని ఖండించు ఘట్టములు కూర్చుటయు, ఆంగ్లేయ పదముల పాత్రల ముఖమున పలికించుటయు ప్రధానశాంతవాతావరణమునకు భంజకములై కల్పనాస్ఖాలిత్యమునకు ఉదాహరణములగుచున్నవి. ఏకోహిదోషో గుణసన్నిపాతే అని వీనిని విస్మరింపవలెను.

ఆంధ్రనాటకపితామహుని కళావైభవమిం కెంతయో కలదు. వీరి యశోగానమును ముగించుటకు మున్ను ఆంధ్ర

ప్రజానీకమునకు, ఆంధ్రప్రభుత్వమునకును, ఆంధ్ర దేశమునందలి విశ్వవిద్యాలయములకును ఒక విన్నపము చేయదగి యున్నది. నాటక పితామహుని యమూల్య రచన లెన్నో ముద్రిణ భాగ్యము నందక పడి యున్నవి. ఇది యాంధ్ర లోకమునకు తలవంపులు తెచ్చువిషాద సన్నివేశము. కృష్ణమాచార్యుల వారి అముద్రిత నాటకముల ముద్రించి లోకమున కందజేయుట పైవారి విధ్యుక్త ధర్మమై యున్నదని మనవి.



# 4. రెడ్డియుగము-ఆంధ్రవాఙ్మయము

(శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు)

---

రెడ్డియుగము ప్రధానముగఁ దెలుఁగు వాఙ్మయమునకొక విశిష్టతఁ గలిగించినది. రెడ్డియుగమున నంతకుఁ బూర్వకాలమున వాడుక యందుండిన నియమ నిబంధనములును, సంప్రదాయములును, సడలుచువచ్చినవి. ఇది యాంధ్రవాఙ్మయమున నధికముగఁ గానవచ్చును. ఈ యుగమునాఁటి యాంధ్రవాఙ్మయము విశిష్టతఁ దెలిసికొనవలెనన్న నంతకుఁ బూర్వపుయుగముల నావాఙ్మయ స్థితిగతు లెట్లుండెనో తెలిసికొనుట యావశ్యకము. రెడ్డియుగమునకుఁ బూర్వము దేవతల భాష యగుటవలనను, బవిత్రమైన మతగ్రంథ భాషయగుట వలనను దేశభాషలకంటెను సంస్కృతమే యుత్తమస్థానము నాక్రమించియుండెను. దేశభాషలన్నియు దాని తరువాత నే. కడకు సంఘమునఁగూడ సంస్కృతాంధ్ర విద్యా విశారదులకుఁ జూపఁబడు మర్యాదయందును, గౌరవమునందుఁగూడ వ్యత్యాసముండెడిది. ఆంధ్రమున నెంతటి గొప్ప పండితుఁడైనను, నెంతటి మహాకవియైనను నాతనికి సంస్కృత పండితునికివలె దుల్య గౌరవమర్యాదలు జూపువారు కారు. గీర్వాణభాషా పారంగతులకుఁ దెలుఁగు పండితుఁడన్నను, గవియన్నను నొక విధమైన ఈసడింపు. గీర్వాణభాషయే రాజభాష, పండిత భాష, అదియే యుత్తమ గ్రంథ రచనమునకును, నుత్తమభావ

ప్రకటనమునకు ననుకూలించు భాష, తెలుగన్నది జన సామాన్యము భాష, కావ్యత్వసిద్ధి కనర్హముకాదను భావము గీర్వాణవిద్వాంసులలో వ్యాపించి, వారిమూలమున రాజులకుం గూడ నమ్మకము కుదిరి, యాంద్వారమున నది నిజమయినం గావచ్చునని ప్రజలలోంగూడ ననుమాన ముదయించెను. ఈ విధమయిన యభిప్రాయములు రెడ్డియుగమునకుం జాలకాలమునకుం బూర్వమునుండియుం బ్రజలలో, ముఖ్యముగాం బరిపాలకులలో వ్యాపించియుండెను. భూవరులు ప్రధానముగ గీర్వాణ పండితుల కాదరప్రాపకము లొసగి పోషింపంగా, నాంధ్రము సామంతమాండలిక స్థానములయం దాశ్రయ పోషణముల కొఱకుంగుంపు చేతం బట్టుకొని తిరుగులాడం జొచ్చినది. ఆంధ్రకవులు సామంతమండలేశ్వరుల, మంత్రిసేనాపతుల ప్రాపకమున జీవింపవలసినవా రయిరి. సంస్కృతాంధ్రములకుంగల యీ వ్యత్యాసము కొంచె మించుమించుగ రెడ్డియుగము వఱకు నూపిరిపోసికొని బ్రతికినది. ఈ కారణమున మహారాజులైనవారే యేభూదానాగ్రహార దానములు కావించినను, వానిని కేవలము సంస్కృతపండితులకును, సంస్కృతకవులకునే యొసంగుచువచ్చిరికాని, తెలుంగుపండితునకుంగాని తెలుంగుకవియన్న వానికిగాని యిచ్చిన పాపమునం బోయినవారు కారు. ఏ రాజు దానముచేసిన యగ్రహారమునందయినను నొకవేళనే తెలుగుకవికైన వృత్తియుండె నన్నచో నది యాతని సంస్కృతపాండిత్య గరిమనుబట్టి సంక్రమించినదే కాని తదన్యము కాదు. నిజమే. ఆ మహాభాగుడు వేంగీచాళుక్యధరావరుడు రాజ రాజనరేంద్రుడు స్వభావమైన యాంధ్రమునెడల నభిమానము జూపి యాంధ్రకవుల నాదరించుటయే

కాదు, ఆంధ్రమున గ్రంథములను రచియింప బ్రోత్సాహము నొసఁగిన మాటయు నిజమే. కాని, యాతని సంతతివారయిన చాళుక్యులు మాతామహరాజ్యమయిన చోళదేశమున కరిగి పెంపుడు భాషయగు తమిళమును బ్రోదిసేసిరి కాని తండ్రి వంకవారి తల్లి భాషయైన తెలుఁగువంక గన్నెత్తి చూచుటకు గూడ వారి కలుసయిపోయినది. కాలక్రమమున పరిస్థితులు మాఱినవి, దేశమున మతము—హిందూ మతము మఱింత పురికొన్నది. గీర్వాణ "ఖింక నన్ను దింపినను దిగ" నని భీష్మించి గద్దె యెక్కి కూర్చుండి రాచరికము చేసినది. రాజులుఁగూడ సంస్కృతము మీఱినారు. మహారాజాస్థానముల యందు సంస్కృతవిద్వాంసులదే పలుకుబడి. ఇంక తెలు గిదివ ఱలో నుడివినట్లు రెడ్డిరాజులకు బూర్వయుగమున సామంతుల నో స్వతంత్రులగు మాండలికులనో పట్టికొని దినములు గడపి నది. రాజరాజనరేంద్రుని యడుగుజాడల నడిచిన మహారాజులును, మహామండలేశ్వరులును లేరైరి. కాకతీయయుగమున గూడ నిట్టిపరిస్థితులే ప్రబలముగ నుండు రెడ్డియుగ మొక మార్పు దెచ్చిపెట్టినది.

రెడ్లు ఏకరాజ్యస్థాపనాచార్యులును, నేకసింహాసనాధీశ్వరులునయి మహామండలేశ్వర, మహారాజాధిరాజపదముల నందిన పిదప దెలుగును మఱవలేదు, విడిచిపెట్టను లేదు. పైపెచ్చు దానిని రాజమర్యాదలతో సత్కరించి పోషించి యున్నారు. అట్లని వారు సంస్కృతమును విడనాడలేదు,

తమకు నూతనముగ లభించిన మహారాజపదము, గౌరవము నకు లాంఛనముగ సంస్కృతమును లాలించినారు. ఈ విధమున నాంధ్రసంస్కృతములు రెండును నీయుగమున మహారాజుల మెత్తుచేతుల బిడ్డలైనవి. ఇది సంస్కృత భామినికిఁ గన్గొలఁగులు నెట్టదనమును వాసింపఁజేసెనేమో మన కేమి తెలియును? ఈ విధమున నీ రెడ్డియుగమున గీర్వాణ రవ్వంత మొక్క తలవాచుకొని యొక్క మెట్టు క్రిందికి దిగఁగాఁ దెలుఁగు రవంత ప్రౌఢముగఁ దలయెత్తి యొక్క మెట్టు పై కెక్కినది. ఈయుగమున నీ రెండును తెలుఁగుసీమలోని యితర రాజ్యములయందుననెనే రెడ్డిరాజ్యముననుగూడ వీటి రాజ సభా మండపమున సమానమైన "పాయ"తోఁ గలిసికొన్నవి; ఒకదాని కొకటి చేతు లందించుకొన్నవి. నాఁటి తెలుఁగు మహాకవి శ్రీనాథకవిసార్వభౌముని సంస్కృత పండితులకుఁ గూడ విద్యాపరీక్షాధికారిని గావించిన యీ రెడ్డి యుగము నే మనవలెను? తెలుఁగున కీవిధమున నీయుగమున దొరకిన మహారాజశ్రీయ, గౌరవాధిక్యములవలన నాంధ్ర వాఙ్మయ వికాసమున నొక నూతనపరిణామము కలిగినది. ఈ కారణము ననే యాంధ్రము భావికాలమున సంస్కృతమునకంటెను నున్నత పదమునంది విరాజిల్లఁ గలిగినది. మున్ముందాంధ్ర కవిత 'పట్టోదత'యై దానికి విజయనగర చక్రవర్తులచేత రాజ మర్యాదలతో సేవింపఁబడఁగల భాగ్యమును జేపడినది.

ఆంధ్రవాఙ్మయమున రెడ్డియుగము తెచ్చిపెట్టిన మార్పు మఱియొకటి కలదు. అదివఱకుఁగూడ సంగ్రామ

ములు జరుగుచుండినను రాజుల రాజ్యలాభాకాంక్షతో పర
రాజాక్రమణ నివారణమునిమిత్తమో రాజులలో రాజులకు
జరుగుచుండినవి; ప్రధానముగ రాజసైన్యములే యుద్ధము పాల్గొ
నుచుండినవి. కాని యీ యుగము నారంభమున
నాంధ్రులు సాధించిన విజయ మపూర్వమయినది. కేవలము
ప్రజలు తమతోడ్పాటుతో 'వమకోటకు' దానె సంపాదించు
కొన్న విజయ మిది. రాజులు లేరిచట; రాజ్యలాభమును
లేదు. స్వేచ్ఛ, స్వాతంత్ర్యము ఇవియే యాదర్శములు.
ఈ యాదర్శములవలన, ప్రజలు సాధించిన విజయము వారికిఁ
గొంత యాత్మవిశ్వాసమును, నాత్మగౌరవమును గలిగించినది
ప్రజలు రాజుల తోడ్పాటును నాయకత్వమును లేక పోయి
నను... తాముగూడ, గొప్ప కార్యములు సాధింప గల
మనియు, తమను,గూడ గొంత సత్తు కలదనియు, తాము
కేవలము సామాన్యమానవులము కామనియు, వీరులమనియు
వారి యంతరంగమున క్రొత్త ప్రబోధము కలిగినది. ఈ ప్రజా
ప్రబోధ మాంధ్ర వాఙ్మయమున ముఖ్యమైన యొక క్రొత్త
మార్పును గలిగించినది రెడ్డియుగము నారంభము వఱకు
నాంధ్రవాఙ్మయము సంస్కృతవాఙ్మయము వలెఁగూడ, గాక
ప్రత్యేకము మతముకొఱకే, ప్రబోధముకొఱకే, మతధర్మ
వ్యాపనము కొఱకేయైనది. రెడ్డియుగమునకు, బూర్వము
వచ్చిన గ్రంథములన్నియు, ప్రధానముగ సంస్కృత పురాణేతి
హాసముల యనువాదములో యనుసరణములో మాత్రమేయై
చతుర్విధ పురుషార్థములగు ధర్మార్థకామమోక్షములలో
ధర్మమోక్షములను సాధించుటకే వెలసినవి. రెడ్డియుగము

నీ ప్రాచీనసంయమసంప్రదాయశృంఖలములు సడలినవి, కొన్ని తెగినవి. తెలుగుకవిత సామాన్యజన వృత్తవర్ణనమునకును నంతకంతకు వాడుక చేయఁబడుచువచ్చినది. ఈ విషయము శ్రీనాథుని గ్రంథముల వలనను, చాటువులవలనను సువిదిత మగుచున్నది. శ్రీనాథు డచ్చుపోసి విడిచిన యీయుగము నాటి మహాకవియే గాఁడు, ప్రజావాదియైన కవికూడను, దేశ దేశములు తిరిగినవాఁడు, పెక్కు రాజాస్థానములు జొచ్చిన వాడు, భూనేతల నేకులాతనికవితను మెచ్చియుపాయనములిచ్చి సత్కరించినారు. పరశ్శతములైన యాతనిచాటువు లాంధ్రులకు గంఠస్థములే చాలవఱకు. వాని ననుసరించినాటి సాంఘికుల యలవాటలు, నాచారములు ఎన్నని తెలియవచ్చు చున్నవి! ప్రజావిజయ భద్రము వాంఛితమైన దీ రెడ్డియుగము గనుక నేనాఁడు పల్నాటి వీరులచారిత్రమును, కాటమ రాజుకథయు ద్విపద ప్రబంధములుగ నైననేమి—యవతరించుట కవకాశముఁ గలిగినది. ప్రజలు చూపిన శౌర్యమును, ప్రజలు చూపిన యుత్సాహమును శ్రీనాథునివంటి మహాకవులనుఁ కూడ నా నందనముతో బులకరింపఁజేసినవి. అది వీరయుగము. వీర చరిత్రగ్రంథములు వచ్చుటలో నాశ్చర్య మేమి? ఈవిధమున రెడ్లనాటి తెలుఁగు వాఙ్మయము వాఙ్మయమునకును, సంఘ మునకును గల యనుబంధమునే కాక యుపయోగమును కూడ చాటిచెప్పినది. మన దేశచారిత్రమున మొట్టమొదటిమా రాంధ్రవాఙ్మయము సంఘమునకను బంధించిన యితివృత్తము లను పొదిగికొని, ప్రజాహృదయమునకు సన్నిహిత మయినది. కేయూరబాహుచరిత్ర దశకుమార చరిత్రములవంటి గ్రంథము లు వచ్చినమాట వాస్తవమే కాని,యవి వట్టికథలే, కావ్యముల

తెగలోఁ జేరినవికావు. రెడ్డియుగమున నాంధ్రవాఙ్మయమున గలిగిన యీమార్పు వలననే ముందుముందు కావ్యానందమే పరమార్థముగాఁగలరసవంతమైనస్వతంత్రప్రబంధమవతరించుటకు దారియేర్పడినది. ఈరీతిని రెడ్డియుగము మిగిలిన విషయముల యందెటులున్నను ముఖ్యముగ నాంధ్రవాఙ్మయ విషయమున మాత్రమతిత్వరితముగ నంతరించిపోవుచున్న కాలమునకును, దివ్యవర్ణాంచితమును నధికఫల సంభరితమునయిన భావికాలమునకును నతుకు కలుపు సంధిగఁబ్రకాశించినది.

రెడ్డిమన్నిల యాదరపాత్రకముల సంస్కృత కవిపండితులవలెనే యనేకులు తెలుఁగు కవులుకూడ నర్థిల్లి యున్నారు కొండవీటి రెడ్డిరాజులలో నొకొక్కరొకొక్క తెలుఁగు కవిని పోషించిరన్నమనది యతిశయోక్తి కానేరదు. నన్నయభట్టారకుఁడు దిగవిడచిన భారతారణ్యపర్వ శేషమునుఁ బూరించి కవిత్రయమున నొక్కఁడయి వాసిగాంచిన శంభుదాసను నామాంతరముగల యెఱ్ఱాప్రెగడ ప్రోలయవేముని యాస్థాన కవి. మొదట ప్రోలయ వేముని తమ్ముఁడయిన మల్లారెడ్డి యాదరమునుఁబొంది, పిదప రెడ్డి రాజాస్థాన ప్రథమమహాకవియను గౌరవమునకు పాతుఁడై ప్రోలయవేమునిచేత మన్నలను, సత్కారములనుఁ బొందినవాఁడు. నృసింహపురాణము రామాయణము, హరివంశము అను నతఁడు రచియించిన మూఁడుగ్రంథములలోఁ గడపటి రెండు గ్రంథములను నాతఁడు ప్రోయలవేముని కోర్కెవలన రచియించినవే. వారివంశము ప్రోలయవేమారెడ్డి సంకితమిచ్చి యాతఁడు తన కృతజ్ఞతను వెల్లడించుకొనెను. వెన్నెలకంటి సూరయయును

మఱియొక కవినిఁగూడఁ బ్రోలయవేముఁ డగ్రహారదానముల నొసఁగి యాదరించినట్లు తెలియుచున్నది. బహుశః ఈతఁడే కావచ్చుఁ బ్రోలయవేముని కుమారుఁడయిన యనపోతరెడ్డికి గ్రంథములను గృతియిచ్చినట్లు వినుకలి. కాని, యా గ్రంథములు మాత్రమిప్పుడు గానరావు, తుదకాగ్రంథముల పేరులైన దెలియరాకపోవుట మఱియు శోచనీయము. అనపోతరెడ్డి తమ్ముఁడయిన యనవేమారెడ్డి కవితాసక్తినిఁగూర్చియువితరణౌదార్యములనుఁ గూర్చియు, విననివారుండరు. భోజమహారాజు కాలమున ధారానగర మెట్లో యన వేమారెడ్డికాలమున సంస్కృతాంధ్ర వల్లకులకు గొండవీడట్లు ప్రధానాలవాల మయినది. తలలు మార్చి తోకలుమార్చి, యితర కవులు చెప్పిన పద్యము ల నన వేమభూపాల దర్శనాగతులగువారు మరల చెప్పి సత్కారమును బడయుచుండిరి. కాని విచిత్రమేమన, నింతటివితరణౌదార్యములు చూపిన యనవేమారెడ్డికిఁ గృతియొసగినయొక్క కావ్యమైన కానరాకపోవుటయే. ఒకవేళ నట్టి గ్రంథము లుండిన యెడలఁగాలపురుషుని గారడివలన మటుమాయమైనవేమో? సువర్ణదానజలధారా సంసిక్తమయిన యొక్క కవివరేణ్యుని కృతజ్ఞతాహస్తమయినను నాయన వేముని కొక్క కావ్యమును నిబంధించి యొసఁగియుండదా మఱి? నిశ్శంక కొమ్మన రాజమహేంద్రవరపు రెడ్డినృపతులు యాదరణమున వర్ధిల్లిన మఱియొక కవి. ఈతఁడు రచియించినది శివలీలావిలాసము.

ఈ యుగమున వర్ధిల్లిన కవులెల్లరు నొక యెత్తు. శ్రీనాథమహాకవి యొకయెత్తు. ఈతఁడు రచించిన యారాధ్యచరిత్రము, మరుత్తరాట్చరిత్రము, శాలిహానసప్తశతి. శృంగార

నైషధము, భీమఖండము, కాశీఖండము: హరవిలాసము, శివ రాత్రిమాహాత్మ్యము అనుగ్రంథములలో మొదటి మూఁడు గ్రంథములుమాత్ర మింతవఱకుఁగానరాలేదు. "శ్రీనాథుని వీధి నాటకమునుండి" యని లక్షణ గ్రంథములయందు కొన్ని పద్యము లుదాహృతములయినవి. కాని శ్రీనాథుఁడట్టిది వ్రాయలేదేమో, 'శ్రీనాథుని వీధి నాటక' మను పేరు నిప్పుడు చెలామణియగుచున్న చిన్న కబ్బము చాటు పద్య సంకలిత గ్రంథమే. అది వీధియను నాటక లక్షణమున కనుగుణముగ రచియింపఁబడినది కాదు. ఇప్పటి కాతఁడు రచించిన నాటకము లేనియుఁ దెలియరావు. ఎట్లయినను నాయుగ మెత్తి చూపిన దీపము శ్రీనాథకవివరేణ్యుఁడు. అతని కవితా ప్రశస్త్యము నాస్వాదించి తలయూఁపనివారెవ రాంధ్రులలో? సీస పద్యమును నడపించు నాతని నేర్పు, తెలుగునకు సంస్కృతమును, సంస్కృతమునకుఁ దెలుఁగును రత్నసువర్ణ క్రియవలె నగిషీ సొంపు పెంపులు వెలయింపఁగల కౌశలము — శ్రీనాథునిసొమ్మే. ఆకాలపువారు కాని, యతనికి దరువాత రెండువందల సంవత్సరముల కాలమున వర్ధిల్లినవారుకాని శ్రీనాథ మహాకవి సంస్కృత ప్రాబల్యమువలన నుండి తప్పించుకొన్నవారును లేరు! తప్పించుకొని గెలిచిన వారును లేరు. వేలువేలు రాజ స్థానములను దర్శించినవాఁడు శ్రీనాథుఁడు; గౌడడిండిమభట్టు నుద్భటవివాద ప్రౌఢి గెలిచి యాతని కంచుఢక్కను బ్రద్దలుకొట్టి విజయ నగరాధీశుఁడయిన శ్రీరాజాధిరాజ శ్రీమత్ప్రౌఢ ప్రతాప దేవరాయలను మెప్పించి యాచక్రవర్తి ముత్యాల శాలయందు దీనారటంకాల దీర్థమాడినాఁడు. పేద కోమటి వేముని

యాస్థానము చితికిపోయిన పిదప రాజమహేంద్రవరపు రెడ్డి రాజన్యులవలన బహువిధగౌరవసత్కారమును గాంచినవాఁడు. తుదకుఁ గొండవీటిదైననేమి, రాజమహేంద్రవరముదైన నేమి, రెడ్డిరాజ్యసౌధము కూలిపోయిన పిదపఁ బోషణప్రాపకములు చెడి వెతలఁ గుందియు ధైర్యమువీడక ప్రాణావసానసమయమునఁ గూడ దివిజకవివరుని గుండియలు దిగ్గురనగ నరిగినాడట యమరపురి కాతఁడు! నిత్యకల్యాణమును బచ్చతోరణముతో నారంభమై శ్రీనాథుని జీవితము తుదకు విషాదాంతముగఁ బరిణమించినది. అగుఁగాక! ఆతఁడు తన ప్రసన్నకవితాచాతుర్యము వలన దేశమునఁ దెలుఁగుకవిత్వము నెడల నొక్క నూతనాభిరుచిని గలిగించినాఁడు. తనభావమునకు సరిపడిన దన్నచో విదేశీయపదమైన వాడుటకు బంకినవాఁడు కాఁడు; మొట్టమొదటి మాఱు తెలుఁగుకవితయందు వాస్తవికతాముద్రగల కల్పనను భద్రపఱచిన మొట్టమొదటి తెలుఁగు కవి యాతఁడు. ఇది మొదలు తరువాత కవులుగూడ—గొంత జంకుచునేయయ్యుఁ దమ కవితయందు కొంచెముగనో గొప్పగనో యీగుణమును సంతరింపక యుండకపోలేదు. ఇంతయేల శ్రీనాథుడు రెడ్డియుగ మోడ్చి యొడపోసి తీసిన నిగ్గు. అతని కవిత్వమున నాకాలమును నాకాలమున నాతని కవిత్వమును మిన్నగఁ బ్రకాశించిన యపూర్వాద్వితీయ సన్నివేశ మది.

ఆ పూర్వరాజవైభవ మంతయు గతించినది. గతించినవి నాఁటి యాంధ్రుల యధికార ప్రాభవములును, ప్రభుమంత్రోత్సాహ శక్తులును. ఆ కొండవీటి రెడ్డిమన్నీ లెల్లరును గతించిరి; తుదకు శ్రీనాథమహాకవి సార్వభౌముఁడు కూడ గతించినాఁడు.

ఇఁక నిలిచినదేమి? నేఁటి యాంధ్ర సంతతికిఁ, గనుల వేఁడినీటి బిందువు లురలఁజేయు నా కొండ వీటి మహాదుర్గశిథిలావశేషములు తక్క? ముగ్గురు రాజులకు మోహఁబు పుట్టించిన గుఱుతైన యీ! తాఁడు కొండవీడు ప్రాచీనాంధ్ర ప్రతాపవైభవముల కొక స్మారకచిహ్నముగ నిలిచియున్నది నేఁడు!



# 5. నిగమశర్మ అక్క

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

---

ఈ చల్లనితల్లి పేరేమో తెన్నాలి రామకృష్ణకవి మనకుఁ దెలుపలేదు. అతనికే తెలియదేమో వాల్మీకి అగస్త్యునికి పేరులేనియున్న నొకనిని సృజించెను. అతనికి పేరొక్కటే కాదు, మఱేవియు లేదు. ఈయమసృష్టి యట్టిది కాదు. రామకృష్ణుఁ డమృతములో లేఖిని నద్ది తిద్ది తీర్చి యూడించిన పుత్తడిబొమ్మయిది, కావున పేరులేకున్న నేమి? నిగమశర్మ వంటి పెద్దపేరే 'నేతిబీరకాయ' కాలేదా? తెన్నాలివాని నిర్మాణములో పేరుపెంపుగల యే యితర వ్యక్తికిని ఈయనామధేయకుఁగల జీవకళలో, నయనాణ్యములలో పదింట నొక పాలును లేదు.

ఎవఁడో యొక చిత్రకారుని వేళాకోళము చేయుటకై తానును చిత్రింపఁగలఁడని చెప్పి, గోడనిండ తోకలు వ్రాసి గుఱ్ఱములా పరిక్కు నున్నవని చెప్పి రాయలవారిని నవ్వించిన వాఁడఁట రామకృష్ణుడు! వాని కవిత్వమాదేమో యీ

ధర్మము చాలఁ గానవచ్చును. అంగసృష్టి అంగి సృష్టికన ఎక్కువ. కాని యాయంగములే, ప్రాతఃకాలమునఁ బ్రాకారవ మీఁద నిక్కి చూచు లేఁడీఁగల కొనలవలె, ప్రాణశక్తితో తకతకలాడుచుండును. సంపూర్ణ వస్తు నిర్మాణమునకు అత యందులేనిది నేర్పుకాదు' ఓర్పు. వేళాకోళపుఁగందువలన పరిహాసపు పట్టులను వెదకుట యతని స్వభావము గావున ఒ వస్తువు నాద్యంతపుష్టిగాఁ బరీక్షించులోపల చూపు వేఱొ చోటికి పాఱును. మొదటిదానియెడ శ్రద్ధతగ్గును. పరిహాస కుశలత తెలివి చుఱుకుఁదనమునకు గుర్తు. అది గలచోట సామాన్యముగ సోమరితనమును, అశ్రద్ధయునుండును. కథల లోని కొంటె భాగవతపు రామకృష్ణుఁడే కావ్యములందును కొంచము నాగరకవేషపు నాజూకులతో ప్రతిఫలించు చున్నాఁడనుట రసికులందఱును గమనించిన విషయమే. ఇతని రచనలోని మాటలపోటు. నిర్లక్ష్యపునడక, భావముల తీండ్ర—అన్నియు దాని పరిణామములే. కాని కొంత శ్రద్ధ వహించి పనిచేసినా ప్రతిమయంగములు అంగాంగములను కళకళలాడునట్లు నిలుపక పట్టి ప్రదర్శించు అపూర్వ సూత్ర ధారవిద్య ఇతనికిఁగలదనుట కీ పేరులేని పేరంటాలే శాశ్వత సాక్షి.

ఈమె తండ్రి సభాపతి పేరునకుఁ దగినట్లు వేదముల్ వ్రాసిన గాదె, శాస్త్రములు పుట్టినయిల్లు. కళాకలాపముల్ డాసిన రచ్చ." పీఠికాపుర సంస్థానమున పేరెన్నికగన్న వైది కాచార్యుఁడు. అగర్భశ్రీమంతుఁడు. రాజాధిరాజుల

మొక్కలు దిన్నవాఁడు. ఆహితాగ్ని. ఇంటిలో ముప్పొద్దు భగవదారాధన, అతిథుల సమారాదన, శిష్యుల వేదముల సంత, శాస్త్రముల చదువు — వీఁకిఁదోడు వడ్డివ్యాపారము, కుడివారము మేలువారము, రెండునుగల సేద్యము, దానికి వలయు పశుశిశుదాసదాసీజనములు, 'రాజాలయమునకు రాకపోకలు:— వీనితోఁ తీరిక గలిగినప్పుడు 'అంగడి'కి బోయి గ్రామకార్యము దీర్చవలసిన ధర్మాధికారము. ఇట్టితఁడు వైదిక లౌకికములు రెంటిని సమానముగా కలిపి మెదిపి కరువుపోసిన దొడ్డవిగ్రహము. చదువు, చనవు, పరువు— మూఁడును సంపాదించిన మూర్తి.

తల్లి 'అతులనిష్ఠ' గల ముసలిముత్తైదున. అత్తగా రవసానకాలమున నిచ్చిన హరిసుదర్శనపుఁ బేరు అమూల్య పవిత్రాభరణముగా నెంచి పండుగవేళలఁ బెట్టుకొని తీసి దాఁచుచు, తరతరములనుండి కూడబెట్టగా వచ్చిన 'మూల విత్తము' రహస్యమును బైలుపడనీక భద్రముగాఁ గాపాడుచు వయసు ముదిరినను గొడ్డుపోక బిడ్డలను కడుపునిండఁ గనుచు ధర్మార్థములు రెంటిని సమానముగా సంసారమందు నిర్వహింపఁగల్గిన పెద్ద యిల్లాలు.

ఇట్టి తల్లిదండ్రుల కడుపునఁ బుట్టిపెరిగిన పెద్దకూఁతురు మన కథానాయిక. కులాభిమానము, ధర్మార్థములందలి జాగ్రత్త, తెలివితేట, పలుకులనయగారము, శీలనైర్మల్యము పనిపాటలందలి దిట్టతనము, తీవ్రమైన ప్రయోజనదృష్టి— ఇవన్నియు నామెకు చిన్ననాఁటినుండి చెప్పక చూపక వచ్చిన

చిట్టలు. వ్రాఁత చదువుల సమాచారము తెలియరాదు. ప్రాయశః ఆమె వానిని నేర్వలేదు నష్టమును అంతగా లేదు. అత్తవారిల్లు పుట్టినింటి కైదామడలదూరము. ఈ సంసారముతో వియ్యమందిన యీసంసారపు పెద్దతన మెట్టిదో మనము కొంత యూహింపఁగలము. తమకంటె గొప్పవారింటికే యాఁడబిడ్డ నిచ్చుట కంగలును బ్రయత్నింతురు. ఇంక భర్త?— అతఁడు రామకృష్ణకవి పెద్దకుంచెనద్ది గోడపై దీడి చిత్రించిన తోఁకలలో నొకటి. భార్య చేతితోఁ దాఁకినచోఁ గదలును. అంతే. ఇరువురికిని "ఇంతలు అంతలు నగు సంతానము" సమృద్ధి.

తనయింటఁ దాను మర్యాదగా సంసారము చేసికొనుచున్న యీమెకు పుట్టినింటినుండి వార్తయొకటి వచ్చి చాల మనసు నొప్పించినది. తమ్ముఁడు నిగమశర్మ వచ్చి పోకిరీయై పోయినాఁడు. ఆస్తియెల్ల నించుమించుగా కరఁగఁ దిన్నాఁడు. ఆచార వ్యవహారము లడుగంటినవి. మానమర్యాదలు, చదువు సంతలు నశింపవచ్చినవి. అభక్ష్యభక్షణము, అపేయపానము, అప్పులు, జూదము, మోసము, దొంగతికము మొదలగువానికి లోఁగి కడపటిలోఁతునకు దిగినాఁడు. కంచంత కాఁపురము. తల్లిదండ్రులు ముదుకలు. దిక్కువిచారించువారు లేరు.

ఇంటి పెద్దకూఁతురు తాను. నిగముఁడు తానెత్తి ముద్దాడిపెంచి పెద్దఁజేసిన తమ్ముఁగుఱ్ఱ. వానికి బుద్ధిఁజెప్పి

తోఁ బ్రతుకఁ దేలేనా యనుకొన్నది. మగనిని, బిడ్డలను గట్టుకొని యొకనాఁడు బయలుదేరి పుట్టినింటికి వచ్చినది.

ఇంటిలోఁ జూడఁగా అన్నియు నన్ని తోవలైచెడి చెట్టాకులఁగలసినవి. 'సన్నాహము' అను జీవధర్మమే లేదు. ఎవరును ఏ పనికిని పూనుకొనువారు గానరైరి. తల్లిదండ్రులు చెఱియొకమూల ప్రాణావశిష్టులై వగల మునిఁగి సుడివడియున్నారు. పెరుమాళ్ళ యింటిలో బూజు నిండినది. పాత్రలు ప్రాఁచిపట్టినవి. పెద్దయిల్లు చూచి మధ్యాహ్నమునకు వచ్చు నతిథులు మాటాడించువారు లేక వేఱుగృహముల వెదకఁబోవుచున్నారు. చిన్నపిల్లలు వేళ కన్నము, నీగ విచారించువారులేక మాసి నలఁగినారు. పాఁడియావులు బందలునొడ్లకో, బైటి తెరువులకో పాలయినవి. పనివారు మొగముఁజూపుట అరుదైనది. వారి జీతబత్తెము లరయువారు లేరు. పుస్తకభాండాగారములోని తాటాకుల గ్రంథములుకొన్ని—దీపారాధనయందలి యసడ్డచేఁగాబోలు— నిప్పుపాలైనవి. కొన్ని దుమ్మొదవి త్రాళ్ళుదెగి చెల్లాచెదరైనవి. కొన్నిటిని ఎరవుతీసికొనిపోయినవారు నిగమశర్మ పుణ్యాన మాకే దక్కెనని తామే యుంచుకొన్నారు. శిష్యుల పాఠప్రవచనములమాట చెప్పనే పనిలేదు. మడి, మట్రి, చేను, చెట్టు- మొదలగునవియెల్ల చేయివేసినవారి సొత్తులైనవి. ఇన్ని యనర్థములకు మూలకారణము తమ్ముఁడింటిలో లేఁడు. ఎక్కడనున్నాఁడో ఎప్పుడు వచ్చునో రానేరాఁడో తెలుపువారు లేరు.

కారము. ఇట్టి వదినను సంపాదించుకొనఁగల పుణ్యవతులు మఱందండ్రెందఱు గలరు?

ఇల్లెన్నాళ్ళు గడచెనో! ఉన్నకున్నట్టుగా 'చుక్క తెగిపడిన వదువున' ఒక్కనాఁడు తమ్ముఁడు వచ్చి వాలినాఁడు. ఉప్పులవారివలె అఁకలికిని దలదాఁచుకొనుట సాధ్యము గాదు గదా! ఎన్ని పూఁటలనుండి పస్తుండెనో? మధ్యాహ్న భోజన పంక్తికి తండ్రి మొగము కనఁబడునని భయము. కావున మెల్లఁగ తల్లిని బీడించి 'చల్దివంటకము' దిని చప్పున తప్పించుకొని పోదమని వచ్చినాఁడు. కాలిడిన వెంటనే అక్క మొగము కనిపించినది. తప్పించుకొని పోఁగలఁడా? ఆప్రేమమయి చిరునవ్వు సంకెలలను ద్రెంచుకొని ఆ మహనీయమూర్తి యెడ తనకుఁగల గౌరవభారమును దిగఁద్రోసిపోవుటకు శక్తి యెక్కడిది? వచ్చి నమస్కరించినాఁడు. ఇతరులు పెద్దవారు తన్ను శిక్షింపఁగా 'గడుసువడిసడి కోర్చి గడిదేఱి వంకపరక చాటును మూని' రాజా రోషుగాఁదిరుగ మరగినవాఁడు ఆమె యెదుర వంచినతల యెత్తలేఁడయ్యెను.

నమస్కరించిన తమ్ముని కౌఁగిలింపఁ బోయినది. కాని వానిని సమీపించి చూచినప్పుడు తాఁక మనసురా లేదు. ఎక్కడ చూచినను మేనినిండ "సుదోన్మత్త మత్తకాశినీ దత్తంబులగు నఖాంకంబులు" నెత్తురులు చిలుకుచుండెను. మనసునఁగాని, మేనిలోఁగాని యింతయు మైల కెన్నఁడును

చోటీయని యామెకు వాని యట్టి శరీరమును కౌఁగిలించుట
యాయూరి వాఁడవదినెలఁ గౌఁగిలించుటయో యగునని తోఁచెఁ
గాఁబోలు! ఊరక, లోనివెగకెల్ల నడచుకొని, "సీమంతపుఁ
బెండ్లికొడుకవు గమ్మని హేతుగర్భితంబుగా" ఆశీర్వదించినది.
అతఁడు గుమ్మడికాయలదొంగ. తెలిసియున్నది, ఆ దీవనలోని
భావము కనుఁగొన్నాఁడు. ఉపన్యాసములు ఉపదేశములు
చివాట్లను ఈమెయు నుపక్రమించునేమో! ఇది యొక్కడి
గొడవ పోదమని యంకించినాఁడు. ఆమె వ్రేలును జూపకయే
హస్తమునేగాదు మేనెల్ల దిగమ్రింగఁగల జాణ. ఆత్రపడి
వాని కసహ్యమైన భావమును సూచించి పొరపడితి నని
యెఱిఁగినది. వానిది సోఁకోర్వని సుకుమారత్వము. ఈత్రోవ
కాదని నిర్ణయించి "తరంగితవినయ సౌహార్దమార్దవమాధురంబు
లగు మాటల తేటలం బందిరికెట్టె" నది. ఆ పందిరియే వాని
పాలికి పంజరమై పోయినది. చాలవందకు "నీచిన్న మేనల్లుని
జూచితివా? ఇదె" అని యిందుబింబమువంటి తన కడగొట్టు
కొడుకును — ఊరకచూపలేదు — చంక కిచ్చినది. వాని మొగ
మునఁ గానవచ్చిన యాఁకలినకనకలు చూచి వీనిఁగట్టి
వేయు బ్రహ్మాస్త్రమిదిరా యని "మీ బావబంతి నారగిం
తువు గాక. శాకపాకంబులు నిమిషంబులోనం గావింతు" నని
ప్రయోగించినది. ఈలోన ముఖ్యమైన వ్యక్తిని మఱఁదలిని
మఱచునా? ఆమెకు కనుసన్న చేసి వానికాళ్లు గడిగించినది.
ఇఁక ఇన్ని బంగారుత్రాళ్ళనుండి తప్పించుకొనుట యెట్లు?
వాఁడు గుక్కుమిక్కనక తలంటుస్నానము; నూతనవస్త్ర

ధారణము, వెండ్రుకలతడియార్పు, పూలముడుపు, గంధపుమై పూఁత—మొదలగు నన్ని యుపచారములకును మేనొగ్గినాఁడు. అపురూపముగా మగని కీసేవలు చేయఁగల్గి వానియిల్లాలు ధన్యురాల ననుకొన్నది. ఆమె యాశలు మొలచినవి.

ఇంతలో వంట తయారైనది. దేవతలకు బోనాలుపెట్టి నంత—సామాన్యముగా మెచ్చుకొను స్వభావములేని పోరాని పెద్దచుట్టమునకు విందులు చేసినంత—శ్రద్ధతో భయముతో అక్క తమ్మునికి పలువగల వంటలు వండినది కనుగీటివంతలో నని! తల్లిదండ్రులకును భర్తకును మానసుత్రము వేసినది. తన బిడ్డతో పాటు వారిపంక్తిలో తమ్మునికి చేయార తానే తృప్తిగా వడ్డించినది. వాఁడు భుజించినపిదప—ఎంత చెడినను వైదికుల యింటిబిడ్డఁడుగదా-వాకిటి యింటితిన్నెపైఁ గూర్చు న్నాఁడు. భార్యకు రెండవమాఱు కనుసన్న చేయనక్క-ఱ లేదుగదా! ఆమె వచ్చి అరుగుచెంత నిలుచుకొని తాంబూలము చుట్టియిచ్చుచున్నది. అతని కిప్పుడు పదునాల్గులోకములును చల్లగా సుఖముగా నిండుగడుపుతోఁ గానవచ్చుచున్నవి. చీవాట్లను, తిట్లను చిఱునగవుతో స్వీకరింపఁసఁగల యుదారహృదయముతో నున్నాఁడు.

తానును ఇంతలో భుజించి వంటయింటి పనుల ముగిం వచ్చినది. పరగడుపుతో ఈ మహాకార్యము నెఱవేర్చుట తనకును కష్టముగదా. చంట వెంట సందడిసేయుసంతానము. నెమ్మదిగా అరుగుదగ్గఱ నిలిచి, చీరవేల చిట్టడవిగా

నున్న వాని తలనుజూచి "సీ! ఏమిరా యిది!" అని ప్రేమ ప్రస్తావనచేసి, జుట్టుముడివిడిచి విదలించి. ఈళ్ళు గ్రుక్క, అట్లంబోడిచి; గోరుముక్కల దగ దువ్వి. తూరుపెత్తి, వేల నన్నటిని దిగిచి ముడివేసినది. వానిమెడకు మన్ను నలంచినది. పాణిపద్మములు గరగరగాంగడుగుకొన్నది. ఆ వేళకు సరిగా అద నెఱంగిన మఱదలు విడెము మడిచి యిచ్చుచుండగాందాసి తెచ్చిపెట్టిన పీటపైం గుడిప్రక్క నించుక యోరగిల్లి కూర్చున్నది. ఎడమప్రక్క బిడ్డండు చనుద్రావుచున్నాండు. ఈ రీవిని భావించి "పద్మకర్ణిక(?) యున్న పద్మమోలె" నున్నదన్న పోలికలో నతిశయోక్తి యేమైనంగలదా? కావుననే యాతండు ముక్కాలుమువీ్సమును ఆస్తి యంతయుంగరంగి పోయిన యా యింటిలోంగూడ-నిగమశర్మ తల్లినడిగి కాంబోలు-దాంచి యుంచిన ".పసిమిపసిండివీవన" తెప్పించి మఱదలిచే వదినెకు విసరించు చున్నాండు! వజ్రాలవీవనతో విసరినను అదివ్య మూర్తికిం దక్కువయేకదా!

చెప్పవలసిన మాటలు చెప్పుటకింత కంటె మంచి సమయ మేది? "ఏమినాయనా! ఎన్నాళ్ళాయెరా మాయూరికి నీవువచ్చి? "ప్రారంభించి యఖండముగా జరుగుచున్న వేద పాఠమునకు విఘ్నమగునని వెఱచితివికదా!" అని తివ్నగా ఏసమాటలతో నుపక్రమించినది. కాని గ్రా ప ది వ లె నే యామెయు 'రక్కసతాల్మి'తో మదిలో నణంచిపెట్టుకొన్న యలుక యూసన్న సన్నమఱుంగు మాటలతోం దీఱునా?

"సాలగ్రామాలగనిలో గులకరాయివలె సముద్రమువంటి యాతండ్రికడుపున ఇట్టివాఁడ వెట్లు పుట్టితివి!" అనియొక్కమాటుగాఁ గసరి పల్కినది. బ్రహ్మనుండి తమవరకు మచ్చ వేఱెఱుఁగని బ్రాహ్మణవంశమే! తల్లిదండ్రులు ముసలివారు. తమ్ములు పసుగందులు. తా నింటికి పెద్దకొడుకు. వారిగతి యేమి? చేసికొన్న యిల్లాలి దిక్కేమి? వచ్చిపోవు విద్వాంసుల మన్నించుమాట యెట్లు? ఇంటిమర్యాదల కేమిత్రోవ? తనయొక్కని చెడునడవడిచే ఇంటివారందఱు శీఘ్రము పిల్లిశీలమని, చదువులు చిలుక చదువులని తోడివారెల్ల నవ్వుచున్నారే! "ఏల యిట్లు బేలనైతివి? అన్నా! ఏల నీకీ గుణము?" అని కడుపోపక కెరలి పల్కినది.

కాని యిది తప్పుదారి. పాపముచేయువారు తిట్లచే నెప్పుడును తమనడత మానరు. మీఁదుక్కిలి తిరుగఁబడుదురు. వెనుక గురుజనము శిక్షించినప్పుడు వారి కదే మర్యాద జరిగినది. నచ్చినపని వానిని దారికిఁ దెచ్చుటకాని తనకడుపు కసిదీఱ నాలుగుతిట్లు దిట్టి మరలిపోవుట గాదు. అది యుదాసీనులు అజ్ఞానులును జేయు పని, హితకాంక్షులు చేయునది గాదు. ఆ కుశలాశయ' కిది తెలియకపోవునా? అలుక మగిడించికొన్నది. స్వరముమార్చినది. సామరస్యము వెలిఁబుచ్చినది. 'భారతమునకు నీవే కర్ణునివలెయీయింటి కాధారము. నీవులేనిది కథనడువదు' అని యతని పౌరుషమున కన్వయించి పురికొల్పినది. నీవు యజ్ఞము చేయఁగా వేదికను నే నలంకరించి సుమంగలీపూజ లందుదునని గంపెడాసతో వేయి

మందిలోఁ జెప్పుకొన్నానే! నా యాశలు త్రెంచితివే!' యని సౌభ్రాత్రమును జూపి కన్నీరు పెట్టుకొనఁబోయినది. 'కామవికారము బలమై యుండెనేని రూప గుణముల శీలములఁ గల్గు బ్రాహ్మణ కన్యలను వేయి మంది నైనను పెండ్లాడరాదా! బ్రాహ్మణ గృహస్థునికి బహుపత్నీ వ్రతము తప్పని యెవరు చెప్పగలవారు! ఈ పడువాఱ కాంతల వ్యవహారము నీ కెందుకు? వారిదో పిళ్ళకు నున్నీలు, ఆఘ్యులును దట్టుకొనఁ జాలరే! ఇంక బాపన సంసారులము మనగతి యేమి? అని తీవ్రమైన వ్యావహారిక దృష్టితో వాదించినది. అదియుఁబోనీ చేత నున్న డబ్బు మాత్రము తెలివితో వెచ్చించి యూరకుంటివా! అట్టెయుండిన ఇంత దుఃఖ ముండదే! 'ముకా-రుంబందు నఖండ సేతువృతముల్ కాశ్మీర ఖండంపుఁ గేదారంబుల్ తెగనమ్మితివే! నీకేమి భార్య లేదా? బిడ్డలు పుట్టరా? వెన్నంటి పుట్టిన తమ్ములు లేరా? ఇట్లు కులధ్వంసము చేయుదుగా యెవరైన? అని తనవారి తప్పులను క్షమించి సరిపుచ్చుకోఁగల స్త్రీహృదయమార్దవమును వెలువఱిచి అధర్మము చేసినను అవివేకముగా చేయరాదను సామాన్య న్యాయమును చాటిచెప్పినది. వేశ్యాజనుల వంకరటింకరలన్నియు సూదులతోఁ బొడిచినట్లు వాని గుండెకంట నొత్తి కుచ్చి యెత్తి పెట్టినది. కడకు వానిచేతిలో చేయివేసి 'చేయి మీఁదుగా నడచిన పుణ్యకాముఁడవే! నా తమ్ముడవే నీకీ బికారితనమేల? వలదు నాయనా! ఇంకనైన వగలు తండ్రీ యని దీనదీనముగా వేడుకొన్నది. ''నీకుఁ గావలసెనాహారి

కౌస్తుభమైనం దెచ్చెద" నని ధీరధీరముగా ప్రతిజ్ఞ చేసినది! తమ్మునికిం దెచ్చి యూసన్నను ఆమెతానే కౌస్తుభమై తెన్నాలి కవిమూలమున తెలుంగువారి చేతికబ్బినది! !

ఇంతటి తెలివితెగువలు, నగవుబిగువులు, అందచందములు కరువుపోసి తయారుచేసిన అపూర్వామృతమూర్తికి రామకృష్ణకవి దృష్టిమక్కగా నొక మచ్చబొట్టు ముక్కుపైం బెట్టినాండు!

అక్కసమృద్ధిమూట లానరించి నిగమశర్మ నాల్గునాళ్లింటిలో వివేకము దెచ్చుకొన్న వానివలెనుండి, యొకనాంటి రాత్రి చేతికిదొరకిన యింటిసొమ్ముల నెల్ల హరించి మూటగట్టుకొని పంచుకొన్న పడుకనుచు బెన్నక పాఱిపోయెను. అప్పుడింట నందఱు నేడ్చిరి. వారితోంత నక్కయు నేడ్చెను. ఎందు కనుకొన్నారు? తమ్ముండు చెడెనే యని కాదు, ఇల్లు మునింగెనే యని కాదు, తన ప్రయత్నము వ్యర్థమాయెనే యనియును గాదు! మఱి "క్రొత్తగాం జేయించుకొన్న ముక్కెర" పోయెనే యని దుర్వారమైనయడలెనంట!

పరిహాసము పవిత్రవస్తువునుగూడ గమనింపదేమో!



# 6. చిన్నయసూరి ఉక్తిలాలిత్యము

శ్రీ దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారు.

---

శ్రీమాన్ పరవస్తు చిన్నయసూరి, ప్రాచీనాంధ్రలక్షణ గ్రంథములు బాలురకుఁ దత్సమప్రక్రియను మాత్రమే యధికముగా నిరూపించుచు, క్లిష్టబంధములుగా రచింపఁబడుటచే బాలుర కుపయోగపడుపద్ధతిలో సులభమార్గమున సూత్రగ్రంథముగా నొకవ్యాకరణమును రచింప సంకల్పించెను.

ఆ రచించుటలోఁ దా నెక్కడనో మూలమునఁ గూరుచుండి లక్షణకర్తగాఁ బేరు గడించుటకయి తోఁచినరీతి నేదో యొకటి వ్రాసిపడవైచుట మాత్రమాతని దృష్టిగాదు. మఱి, అంతకుఁబూర్వ మాచ్ఛిక పదస్వరూపము దెలుపు ప్రక్రియ యంతగా లేకుండుటచే నట్టిపదజాలమును బ్రాచీన గ్రంథములలోనున్న దానిని దనకంటి కానినంతవఱకు సేకరించి, యందలి ముఖ్యాంశములను సంగ్రహముగా బోధింపవలయును. ఆబోధించునది యాంధ్రదేశమందలి బాలబాలికల కందఱకును నిర్దుష్టము సరళమునగు వచనరచన సేయు కౌశలమును గలిగించునదై యుండవలెను."

కావుననే దేశమందలి బాలబాలికలందఱును దనయంతేవాసులుగా నాతండు భావించినాఁడు. తానొకప్రధాన కళాశాలలో నధ్యాపకుఁడుగూడ నగుటచే శిష్యబృందము నడుమ

చిఱునవ్వుమొగముతోఁ గూరుచుండి భాషాసంప్రదాయము లను బోధించుచున్నంతటి తృప్తి యీ రచనాసమయమునఁ గూడ నామహనీయునకుఁ గలదేమో యనిపించును.

అందువలననే సూత్రోదాహరణముల నిచ్చుటలోఁగూడ 'వినుఁడు బాలకులు! వినుఁడు బాలకులార!' అని తనచుట్టును, బాలురఁ గలయంజూచుచున్నటులు, పేరుపేరున సంబోధించి యొక వంకఁ గూరుచున్న బాలికల నుద్దేశించి 'వచ్చితిరి కాంతలు! వచ్చితిరి కాంతలారా!' యని ముద్దుగాఁ బలుకరించి, మరల బాలురదిక్కు మొగంబై 'అన్నలార! మిమ్ము నడిగెద నొకమాట' యని బాలురను మాత్రము ప్రశ్నించు సన్నివేశము (తత్స - 7) నుచితముగా సంఘటించెను. సమాధానములు చెప్పుటలో బాలికలు బిడియపడుదురని కాఁబోలు బాలురనే ప్రశ్నించుట. ఆప్రశ్నించుటలో శిష్యులయెడ నాతనికిఁ గల వాత్సల్యమును, బాలికలయెడ మర్యాదయు, వారికందఱకుఁ బ్రశ్నోత్తరరూపమున నేదో బోధించుచున్న తీరును నొకదాని వెంట నొకటి స్ఫురించును. అనఁగా, ఈదేశమందలి బాలబాలికల కందఱకు నొకతరగతి యేర్పఱచి, తానధ్యాపకుఁడై బోధించుచున్న తీరు, ఈగ్రంథమునందుఁ బెక్కుతావులఁ గాననగుచు నాతని యుత్సాహమును వెల్లడించుననుట.

తానుబోధింపఁ దలఁచినది ప్రాచీనభాషాలక్షణము; ఎదుటనున్నవారా బాలురు, పసివారు. కావునఁదాఁ జెప్పెడి మాటలు శుష్కములై యేవో యుదాహరణసమన్వయమాత్ర ప్రయోజనములై యుండరాదు. మఱి- మృదువులై నీతిబోధకములై భావగర్భితములై, పురాణకథాస్ఫోరకములై

వీలగు నెడ ఛందోబద్ధములై హృదయంగమములై యుండవలయును. అంతియగాదు, తియ్యతియ్యని యనుపానములతో నారోగ్యకరములగు నౌషధముల నిచ్చునట్లు లలితలలితములగు సూక్తులతో భాషాస్వరూపవైవిధ్యమును సోపానక్రమమున, ఆపసివారి మనసులకుఁబట్టునట్లు బోధింపవలయును ఇది బాల వ్యాకరణరచనలో చిన్నయసూరి దృక్పథము. కావుననే గ్రంథారంభమున:

'అనయము లలితోక్తులతో
నొనరుపడం గూర్చి లక్ష్యయోజన మొప్పం
గను బాలవ్యాకరణం
బనఁగా లక్షణ మొనర్తునాంధ్రంబునకున్'

అని తనహృదయము నావిష్కరించియుండెను. తానేవిషయము వివరించినను, ఏలక్ష్యము చూపినను, అందుఁ గుదిరినంత సూక్తిలాలిత్యము గోచరించి బాలురకు నుత్సాహజనకమై యాకర్షకము కావలయుననని యాతని కుతూహలము.

మనోహరములగు కథాఘట్టములను గైకొని సరసములగు కావ్యములు రచించు నెడ లలితముగను హృదయంగమముగను రచన సాగింపవచ్చును. అట్లు సాగింతు మని కవులు ప్రతినలను చేయవచ్చును. ఆప్రతినలు నిర్వహించుకొనుటయు సాధ్యము కావచ్చును. కాని, శుష్కములు నీరసములు నగు వ్యాకరణాంశములను నిరూపించునపుడు గూడ 'లలితోక్తులతోడనే' రచన సాగింతు ననుటయు, అ విధానమును తుదముట్ట నిర్వహించుటయు లాక్షణికులలో నొక్క చిన్నయసూరికే చెల్లినది. అనఁగా,

శుష్క-కర్క-శమైన వ్యాకరణాంశంగూడ నాతనిపలుకుబడితీరులో కావ్యత్వసిద్ధి పొందినదన్నమాట. దీనినిబట్టి సూరిహృదయ మెంత మృదువైనదో, యీయన భావ మెంత విశాలమో, బాలురయెడ నాయన కెట్టి యభిమానమో సులభముగా గ్రహింపనగును.

'అతండు శ్రీమంతుడు-ఇతఁడు గుణవంతుఁడు'-
'ఆమె శ్రీమంతురాలు-ఈమె విద్వాంసురాలు'
'వానివంశము శ్రీమంతము-వీనివంశము గుణవంతము'
(తత్స-71)

పై వాక్యములను జదువుటతోడనే యాతఁడు బాలురను దనయొద్ద, గూర్చుండఁబెట్టుకొని, వారిలోనొక్క-క్కనిని వ్రేలితోఁజూపుచు విషయములను బోధించుచున్న సన్నివేశము మనకన్నులకుఁగట్టును.

శ్రీమంతము. గుణవంతము- విద్వాంసము- అనడ్వాహము-శ్వానము-ఉపానహము.' ఈ యుదాహరణములతీరును క్రమమును, పైసందర్భమున సంధానించుకొని యాతనియాంతర్య మును నిదానముగాఁ బరికింపుడు—

'ధనవంతులైనవారు గుణవంతులు గావలెను: అంతియ గాదు. విద్యాబుద్ధులను గడింపవలెను. అట్లుగాక బుద్ధిలేని యనడ్వాహములైనచో ననాగరకులైవిలువలేక కాలిచెప్పులకుఁ గలహించు శునకమువలె నధములుగాఁ జూడఁబడుదురు" అని బోధించుతీరు నిగూఢముగా నిందిమిడియున్నది.

అంతియగాదు, ఆపిల్లలలో నొకనిని బిల్చి 'భవద్గుణంబులు- త్వదాశ్రయములు' (తత్స-87) నాయనా! నీవు

సుగుణవంతునవు గావలెను. అట్లగుట నీ ప్రవర్తనాభ్యాసముల వలన సిద్ధించును. అది నీలోనే యున్నదిగాని యొకరు తెచ్చి పెట్టవలసినది గాదుసుమా' అని బోధించుతీరునుస్ఫురించు చున్నది.

"మత్పుణ్యము-లసమాప్తము" నాపుణ్యము చాల మంచిది, ఏలయన మీవంటి శ్రద్ధాళువులగు బాలురకుపదేశించు టచే నావ్యాకరణ పరిశ్రమ సార్థకమగుచున్నది గనుక అను నభిప్రాయమిందు గర్భితము.

'భవిష్యత్కాలము - ధూర్వహము - రాబోవుకాల మెట్టిదో! భాషావిషయకముగా నెట్టి యలజడులు పుట్టునో! 'కంటికేగాని కర్ణమునకు గోచరింపని యీయర సున్నలతోం జిక్కులు పడలేముసుమా' యని గోలపెట్టు సుకుమారులు కొందరిప్పటికే యుద్భవించినారు. ఈ ప్రబుద్ధులవలన నెప్పటికో గాదు, హ్రస్వముమీఁద ( - అల్పకాలముననే) ఖండబిందువు నకుఁ బూర్ణబిందువు (O - శూన్యత) బహుళంబుగా (సంజ్ఞ 14) నగునేమో యని భీతి పొడముచున్నది. నేను బహుపరి శ్రమచేసి సంతరించిన యీ వ్యాకృతినియమముల నెంతభద్రముగా సంరక్షింతురో! భారము మీయది సుండి!' యని తన చుట్టునున్న బాలురను గలయఁజూచి యుపదేశించు చున్న తీరుస్ఫురించుట లేదా?

ప్రసంగము వచ్చినపుడెల్ల నుదాహరణవ్యాజమున బాలురహృదయములలో నాటుకొనునట్లు నీతులను ధర్మముల బోధించుట యాతని సహజరమణీయసరణులలో నొకటి. సత్యము

సర్వశ్రేయము, అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు" (సంధి-55) సత్యముపలుకుట యన్నిధర్మములకంటె నుత్తమోత్తమ మని బోధించుట.

అట్లే, 'ధనంబుచేత సౌఖ్యంబు గలుగు, విద్యచేత యశంబు గలుగు". ధనము విద్య' యీరెండిటివలనఁ గలుగు ప్రయోజనముల తారతమ్యముచూపుచు,'సౌఖ్యము తాత్కాలికము, యశము శాశ్వతము, కావున ధనమార్జించుటకన్న విద్యసంపాదించుట యెక్కుడు లాభకర' మని బోధించుట యాతని యాంతర్యము.

ధర్మములను నీతులను బోధించుటయేగాక, యవకాశము గలిగినపుడెల్లఁ జిన్నచిన్న వాక్యములలోఁ బురాతన ప్రసిద్ధ కథాంశములుగూడ బాలురహృదయములకు హత్తుకొనునటు దాహరించుట యీతనిరచనలో గమనింపవలసిన యింకొక విశేషము.

1. రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేడు.
(కారక-12 యాగరక్షణము)

2. విశ్వామిత్రుడు రామునకు మిథిలం గానిపించె.
(క్రియ-124 మిథిలాప్రయాణము)

3. రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబులగు.
(కారక-32 శివధనుర్భంగము)

4. జనకుఁడు రామునకుం గన్య నిచ్చెను.
(కారక-8 సీతాకల్యాణము.)

5. రాముఁడు పట్టిన ప్రతిన వారింప దరంబుగాదు.
(కారక—32 పాదుకా ప్రదానము)

6. రాముఁడు వాలి నొక్క కోలం గూలనేసె.
(కార—వాలివధ.)

7. లంకం గలకలంబు పుట్టె.
(కారక—22 లంకావాసులు భయభ్రాంతులగుట)

8. రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం
దాను సౌమిత్రి సహితంబుగఁ బుష్పకా
రూఢుండయి సాకేతంబున కేతెంచె.
(క్రియ—120 రావణసంహారము అయోధ్యా ప్రవేశము)

9. సుగుణాభిరాముఁడు రామునకు జోహారు నొనర్చెద.
(కారక—27.)

పై వాక్యములఁ బరికించితి మేని రామాయణమునందలి ప్రధాన భాగములు పెక్కులు సూచితములు ఇట్లు శ్రీరాముని గుణగణములను సూచించుట మాత్రమే గాక 'సుగుణాభిరాముఁడు రామునకు జోహారు నొనర్చెద'నని పలుకుటగూడ మిక్కిలి సందర్భోచితముగాఁ గానవచ్చును.

ఇట్టిచట్ల 'శాకరుతంబుకంటె నన్యంబు కర్కశంబు లేదు. ఖరంబుకంటె నితరంబు భారవాహకంబు లేదు' అని యుదాహరించినను లక్షణసమన్వయంబున కెట్టి కొఱంతయు

గలుగదు. అయినను, నీరసములు నిరుపయోగములు నగు వాక్యములం జూపుటలోని లాలిత్యము మెప్పులందక తప్పదుగదా!

ఈ సందర్భమున మరికొన్ని యుదాహరణముల తీరు గూడఁ బరికింపుఁడు— తిర్యక్కులు కర్తలగునపుడు భూత తద్ధర్మాద్యర్థకముల ప్రథమపురుష బహు వచనంబునకు నేక వచనంబగు ననుటకు—

'చిలుకలు పలికెను—చిలుకలు పలుకును' (క్రియా—25) అని యుదాహరణములు. 'ఇట కాకులు కూసెను—కాకులు కూయును' అనరాదా? అనవచ్చును. కాని—అనఁడు. వ్యాకరణము నందైనను బాలకుల చెవులకు సోఁకవలసినది చిలుకల పలుకులుగాని కాకులయఱపులు కావని యాతని దృష్టి.

ఈ రీతిగా వ్యాకరణ ద్వారమున నొకవంక ధర్మములను నీతులను బ్రస్తావించుచు, వేఱొకవంకఁ బురాతనగాథల స్ఫురింపఁజేయుచు, నడుమ నడుమ భక్తిని నెలకొల్పుఁజాలు నలఁతి యలఁతి వాక్యములను, ఛందోబద్ధములై కంఠస్థము లగుట కనువైన చిన్న చిన్న పద్య భాగములను గల్పించి యుదాహరించు నాతని రచనలోని మఱియొక్క విశేషము.

ఈ క్రింది వాక్యములను దిలకింపుడు

'హరి నను గృపఁ గాంచెదును,— (క్రియ—26)

'హరి నను గృపఁ గాంచుతను,— (క్రియ—26)

అర్తిహరుఁడ వౌనినుగొల్తు నంబుజాక్ష' — (కారక—14)
'నందతనయుండు కృష్ణుండు నాకుదిక్కు'— (కారక—12)
'దేవకీపుత్త్రిహరిని నుతింతు నెపుడు' — "
'శుభవిధాయులు రామకృష్ణుల భజింతు' — "
'భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు' — "

భగవద్భక్తిగర్భితములగు నిట్టివాక్యములు పసివారిహృదయము లందు ముద్రితములై యెప్పుడు గాకున్న నెప్పుడేని స్మృతి పథమునకు రాకమాననవనియు, రావలయుననియు నాతనితలంపు

సూరి సరసహృదయుఁడు. సరళస్వభావుఁడును. మితభాషి, మృదుభాషియును. కఠినములు నశ్లీలములునగు పదము లుప యోగించుటగాని, పరుషముగాఁ బ్రసంగించుట గాని, యొకరిని లఘూకరించుటగాని యాతనిస్వభావమే కాదనిపించును. లక్షణ నిరూపణముపట్ల నితరులమతము తన కభిమతము గాకున్న తావులందు.

'షష్ఠివిభక్తికములు రావని కొందఱు వక్కాణించిరి'
'ఎందుశబ్దమున కలిగాగమము కొందఱు లేదండ్రు'
'నంబుఁగడాదుల నియోగమంబు లేదండ్రు'

అని యీతీరున మృదువుగను, విషయప్రధానముగ నుజెప్పి విడిచిపైచనేగాని వ్యక్తులపేరైన నెత్తుట యాతనికి రుచింపదు.

ఇంతయేల? లాఘవాపాదకములు, అగౌరవ సూచకములు అమంగళములునగు కార్యములను దెలుపు క్రియలు గల వాక్య ములలోఁ గర్తృసనములను గూర్ప వలసి వచ్చి నపుడు

'దేవదత్తుండు వంటకమును వండెను', (కారక—2)
'మైత్రుఁడు చైత్రునిచేత ఋణంబు గొనియె', (కారక—4),
'మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె' (కారక—9),
'చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె' మున్నగురీతిని, ఏకగ్రంథమునుండి మొదలుపెట్టి వాక్యములు చూపునేగాని, వంటకము వండుట, ఋణంబు గొనుట, రాజ్యభ్రంశము నందుట, మరణించుట మున్నగు క్రియలకుఁ బ్రసిద్ధ రామాది కర్తృపదములను వాడనే లేదు. దీని బట్టి యాయనహృదయ సారళ్య మెట్టిదో; ప్రసంగధోరణి యెంత మృదువుగ నుండునో సులభముగా గ్రహింపనచ్చును.

మఱియు, చేదర్థకానంతర్యార్థకాది ప్రత్యయముల కుదాహరణ లిచ్చునపుడు గూడ:

'వానలు గురిసినం బంటలు పండును' (క్రియ—41)
'జాబిలితోఁ దెంచు దుంగువలయంబులు వికసిల్లె'
(క్రియ—2)

అవి లోకకల్యాణమును, మనోహరదృశ్య సన్నివేశమును గోచరింపఁజేయు వాక్యము లేయాతనికి స్ఫురించునుగాని అమంగళములు, జుగుప్సితములు నగుభావములాసహృదయునికి స్ఫురింపవేమో యనిపించును.

చిన్నయసూరి మంచివివేచనముతో పాటు నిదానమగు చూపును, లౌకికమగు ప్రజ్ఞయుఁ గలవ్యక్తి. శాస్త్రీయ విషయములు క్లిష్టములై దురవగాహములై యారంభ దశలో నున్నవారి కెంతకసివు జనింపఁజేయునో గుర్తించిన

యనుభవశాలి కనుకనే లోకవృత్తములను, మనోహర సన్నివేశములను దనయుదాహరణములలో నతి నిపుణతతోఁ బొదిగి వ్యాకరణ గ్రంథమును జక్కని కావ్యలాలిత్యము గోచరించు నటులు రచించెనా యనిపించును.

కారక పరిచ్ఛేదములో 'జడంబు ద్వితీయకుఁ బ్రథను బహుళంబుగా నగు (కారక–24) అను సూత్రముగలదు. జడవాచక శబ్దముల ద్వితీయకుఁ బ్రథమావిభక్తి వచ్చుట యిందలి విషయము. దాని కుదాహరణములుగా:

'వాఁడు పువ్వులు దెచ్చె–(వాఁడు పువ్వులను దెచ్చె),
'ఆకె సొమ్ములు గాల్చె,–(ఆకె సొమ్ములను దాల్చె)
'వాఁ డిల్లు వెడలె,– (వాఁడింటిని వెడలె)

అను వాక్యముల నిచ్చియుండెను దీనిని సామాన్య దృష్టితో జూచినచో 'పువ్వులను, అను ద్వితీయకు 'పువ్వులు, అని ప్రథమ వచ్చుట మాత్రమే గోచరించును. కాని ఈ సూత్రమందలి పదముల కూర్పును, నుదాహరణ వాక్యములం గలిపి నిదానముగాఁ బరికించినచో నిది యాలుమగల నడుమఁ బ్రవర్తిల్లిన యొక చిన్న వినోదఘట్టముగా స్ఫురించును.

సంసార రంగమున సాధారణముగా భర్త ప్రముఖుఁడు. ఇతరు వ తిది భార్య. అనఁగా ద్వితీయ–ఇది లోక సామాన్యము. కాని, జడుని ద్వితీయ (భార్య)తఱచుగాఁ బ్రథమ యగునట. అనఁగా సంసార రంగములో స్వతంత్రయై ప్రధానురాలగుననుట ఏల యందురా; వాఁడు జడుఁడు–సంసారమును జక్క దిద్దుకొన నేరఁడు. ఆభారము సహజము తానే వహింపవలసి వచ్చును.

కావున నామెకుఁ గొంతవిసుగును భర్తపైన లక్ష్యభావము నేర్పడుట సహజము. అట్టిదానిని గొంతమయినఁ దెలివిలేనివాఁ డగునో వశపఱచు కొనుటయో, పీడుటయో చేయును. ఆ రెండును చేతఁగాని జడుఁడుగాన నామె కేదే నొక మార్గమున నాతఁడు ప్రీతిని గలిగింప యత్నించుట సహజము. అందులకే గావలయును వాఁడు పాపము, ఆమె యిచ్ఛకమునకై పూవులు దెచ్చినాఁడట! ఆమె యాతఁడు తెచ్చిన పూలుముడుచు కొన నిష్టపడక యావలనున్న సొమ్ములు దాల్చినదఁట. అతఁ డెంత జడుఁడైనను దాఁదెచ్చిన పూవులు నిరాకరించుటవలనఁ జిన్నవోక తప్పునుగదా! చిన్నవోయి యేమియుఁ జేయలేక, ఏ మాటయుఁ బలుకలేక యిల్లు వెడలి పోయినాఁడట! ఈచిన్న ఘట్టమున, మందుఁడయిన మగఁడు—చురుకయిన భార్య—ఆ దంపతుల సంసారపు సన్నివేశము స్ఫురింపఁజేసి యెంతసరసముగ సమాసోక్తిని సంఘటించెనో పరికింపుఁడు.

దురిత పరిష్కృతికము మీఁది పరుషములకు సరళములుగ విధించుచు: "పూచెను గలువలు, తోఁచెను జుక్కలు, చేసెను డక్కులు నెగడెను దమములు, మొగిడెను బద్మము" అని యుదాహరించెను. స్థూలదృష్టికిఁ బైయుదాహరణములలోఁ గ్రమముగాఁ బరుషములకు సరళములాదేశములగుట యే మాపట్టును. కాని యాయుదాహరణ సరణిని, క్రమమును సూక్ష్మముగాఁ బరిశీలించి కావ్యదృష్టితోఁ జూచినచో నీవాక్య సరణియందు సాయంసంధ్యావర్ణనమిమిడియున్నట్టులు గోచరించును. సాయంకాల మగుటతోడనే కమల బాంధవుఁడస్తమించుటయుఁ, గలువల జేడుదనగించుటయుఁ బరిపాటిగదా! చంద్రోదయ మైనంతనే కలువలు పూచినవి. చుక్కలును

బోడసూపినవి. క్రమముగాఁ జీఁకటు లలముకొనినవి. కావుననే జారచోరులు టక్కులు (మోసములు) సేయ మొదలిడిరి. జలజబాంధవుఁడస్తమించెను గానఁబద్మములు ముకుళించినవి. ఈతీరునఁ గువలయవికాసము, అను సాయంకాలధర్మముల నిరూపించుటచేఁ దత్సమయస్ఫూర్తియు, సంధ్యాకాలప్రవర్తమాన ప్రకృతిసిద్ధ కార్యస్ఫూర్తియు గలిగించెను. సూరిబుద్ధిపూర్వకముగా నిట్టిసన్నివేశములఁ గల్పించినా, లేక యానుషంగికముగా నయ్యవి కుదురుపడినా' యను చర్చతో మనకుఁ బ్రసక్తి వలదు. శుష్కములగు వ్యాకరణాంశములను నిరూపించుపట్లఁగూడ సూరి దృష్టి మనోహరమై లలితమగు రచనారీతి ననుసరించునని గుర్తించుటమాత్రమే సరసమార్గము.

ఇట్లు సంధిపరిచ్ఛేదాంతమున నను కరణసంధ్యుతోదాహరణములుగా—

"వర్ధతాం శ్రీ, యనియె
తుభ్యం నమో యనె
కింతత్తనియె-కస్త్వమ్మనియె
దాసోహమ్మనె
తత్కర్తవ్య మ్మనె"-

అను వాక్యములు గలవు. సాధారణముగఁ జూచినచో సంస్కృత వాక్యములు తెనుఁగులో ననుకరించినపు డుండవలసిన విధానము మాత్రమే పైవాక్యములలో గోచరించును. కాని సూక్ష్మముగాఁ బరిశీలించితిమేని యిందొక వినోద ప్రసంగము గూడ నిమిడియున్నట్లు బోధపడును.

వైష్ణవసంప్రదాయముల యాచార్యుఁడు తనశిష్యుని వద్ధ తాం శ్రీః (సంపద నర్థిలునుగాక) యని మంగళాశాసన పూర్వకముగాఁ బలుకరించువాఁడఁట. వైష్ణవసంప్రదాయము ననుసరించి 'దాసోహ' మనుచు బ్రాహ్మణు మొనర్పవలయును. అది గుర్తింపని యాశిష్యుఁడు 'అయ్యా! బనస్కార, మను సాధారణరీతిని 'తుభ్యం నమః' అని పల్కినాఁడఁట.

అంతట నాచార్యులు 'కింతత్! కష్టమ్!' అదేమోయి! నీ వెవండవు? వైష్ణవుఁడవు గావా? యని హెచ్చరించెనట.

అప్పు డాతఁడు జ్ఞప్తికిఁ దెచ్చుకొని, నాలుక కఱచుకొని, తప్పుదిద్దుకొని 'దాసోహ'మ్మని పలుకుచు దండముసమర్పించి నాఁడట.

అటుపై నాచార్యులు 'తత్కర్తవ్యమ్' అట్లుచేయవలయు నోయియని పల్కినారఁట! ఈవైష్ణవగురుశిష్యుల ప్రసంగమునం దలి ముచ్చటను గనునింపుఁడు.

సూరి తనగ్రంథమును 'వృషశైలంబున వెలసి...... కోర్కులు చాలంగా నొసగు కల్పసాలముఁ గొలుతుక్" అని దేవతానమస్కారరూప మగు మంగళముతో నుపక్రమించి 'పంకజాక్షాయనాథాయ వేంకటేశాయ మంగళ' మని శుభాంతముగా ముగించి యుండెను. ఈ పద్ధతి సర్వగ్రంథకర్తృసాధారణము.

ఈయనయంత మాత్రము తోఁ దృప్తి చెందక బాలుర శ్రేయ మును మతింతగా నభిలషించినయాతఁడగుటంచేసి గ్రంథాంతము నఁదుట్టతుది సూత్రమును నయితము 'రేఫంబులు లఘ్వలఘువు

లును దక్కంగల విశేషంబులు నార్య వ్యవహారంబులు దెలియుట శ్రేయంబు" అని మంగళకరమగు శ్రేయః పదమును గ్రంథాంతర్భాగము గాఁజేసి తనరచనను ముగించుటలో గోచరించు విశిష్టత గమనింపఁదగినది

అంతియు గాదు, ఆయన లక్షణరచనములోఁ దన్మయాతనాది యసామాన్యమగు నుల్లాసముతోఁ బైనసూచించినరీతిని లక్షణముతోపాటు ధర్మము, నీతి, భక్తి, వినయము, గాంభీర్యము, పెద్దలయెడ గౌరవము పరదూషణవైముఖ్యము మున్నగువాని గూడ వినోదములతో, లలితోక్తులతో, బాలురకు బోధించి వారిని లక్షణజ్ఞులుగ మాత్రమేగాక గుణసంపన్నులుగ నయితము తీర్చిదిద్దుటయే పరమలక్ష్యముగా నెంచి, యందులకై తనజీవితమును ధారవోసిన ధన్యమూర్తి. బాలవ్యాకరణమున నామహానీయుని తాత్పర్యము నడుగడుగునను దూరపుఁజూపుతో నాకళించుకొని యాతని భావములకు సన్నిహితులై మృదువైన యాతని పరిష్కృతిని గ్రహించి యాయన నాదర్శముగ నెంచుకొనఁగల్గిన బాలకులు, సూరియభిలాషము ననుసరించి లక్షణవేత్తలే గాక, గుణసంపన్నులు నయితము గాకమానరు—

'చరిత్రప్రకృతులకు సన్నిహితములగుచో పరుషములు సరళములు' గాకుండుట యెట్లు?

---

# 7. భావ కవిత్వము

## శ్రీ పాటిబండ్ల మాధవశర్మగారు

పాశ్చాత్య వాఙ్మయమునందు దీనికి 'లిరిక్' అని పేరు. 'లైర్' అను నదొక పాశ్చాత్య జాతి విశేషము. దానిమీఁద గానము చేయుటకు వీలుగా వ్రాయఁబడిన కవిత్వము లిరిక్. కనుక లిరిక్ అనే పాశ్చాత్య కవిత్వము ప్రాయికముగాఁ గాన ప్రధానము. ఈ యుద్దేశముతోడనే కాఁబోలు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆంధ్రభాషలోని యీ జాతికవిత్వమునకు "గీతకవిత్వము" అని నామకరణము చేసినారు. కాని పాశ్చాత్యుల లిరిక్ తత్త్వమును విచారించినప్పుడు గీతకవిత్వమనుపదమున కంటె భావ కవిత్వమనుపదమే సమర్థమైన సమానార్థకముగాఁ గనఁబడును.

లిరిక్ కవితను గుఱించి Encyclopaedia Britannica లో "A general term for poetry that can be sung to the accompaniment of a Lyre" అని చెప్పఁబడియున్నది. 'లైర్' అనెడి జంత్రవిశేషముమీఁద గానముచేయుటకు యోగ్యమయిన కవిత్వమున కిది సామాన్య వాచకము. ఇంకను:— "Hegel insists that it is the Personal thought or Passion or Inspiration which gives "its character Lyrical poetry while the metrical form also counts"

గేయాత్మకమయిన కవిత్వము "లిరిక్కు" అనుటను దాఁటి హెగెల్ పండితుఁడు లిరిక్కునకు మఱికొంత విశేషము చెప్పినాఁడు. లిరిక్కు ప్రధానముగా నాత్మాశ్రయము (Personal). కవికిఁ గేవల మాత్మాశ్రయములయిన భావము, రసము రసభావము, ఆవేశము—ఇవియే లిరిక్కునకు ముఖ్య లక్షణములు. గేయాత్మకమైన ఛందోరూపముగూడఁ గణింపఁదగినదే.

"The Lyric has the function of revealing in terms of pure Art, the secrets of inner life, its hopes, its fantastic joys, its sorrows, its delirium."

లిరిక్కు-గాన యోగ్యమని మీఁదఁ జెప్పఁబడినది. కాని "లైర్" అను జంత్రముమీఁద గానము చేయుటకు యోగ్యముగా వ్రాసిన రామాయణమునుగూడ "లిరిక్కు" అగునా? కాదనియే చెప్పవలయును. ఎందుచేతననఁగా నది వాల్మీకికి నాత్మాశ్రయముకాదు. కనుకనే హెగెల్ వాక్యము. హెగెల్ వాక్యము ప్రకారము కవి తన కాత్మీయమయిన స్వీయచరితను గేయరూపమున వర్ణించినను నది లిరిక్కు అనిపించుకొనదు. కవి చరిత్రలో నతని కాంతరంగికములు, బాహిరములయిన ఘట్టములుండవచ్చును. ఈ యాంతరంగిక ఘట్ట

ముతే లిరిక్కులో వర్ణితములు కావలయును. కవియొక్క జీవితమునందలి యాశయములు. ఆనందములు, విషాదములు, ఉద్వేగములు, ఇవియే లిరిక్కునందు వర్ణింపదగినవి.

ఇప్పుడు లిరిక్కును సూక్ష్మముగా నీవిధముగా చెప్ప వచ్చును. గానయోగ్యము, ఆత్మనాయకము, అంతర ప్రవృత్తి ప్రధానమునయిన కవిత్వము "లిరిక్కు" ఈలిరిక్కు యొక్క యనయవార్థమును విచారించిచో దానిగేయత్వ మేస్ఫురించు చున్నది. రామిరెడ్డిగారి "గీతకవిత్వము" కూడ దానిగేయత్వము నేసమర్థించుచున్నది. భావకవిత్వమను పదమువలన దాని గేయత్వము కానరాకపోయినను నాంతరప్రవృత్తి ప్రధానత్వము ధ్వనించుచున్నది. యథార్థము విచారించినచో షేక్స్పియర్ కీట్స్, షెల్లి, మొదలైన పాశ్చాత్యమహాకవులు వ్రాసినలిరిక్కు కావ్యములన్నియు గానయోగ్యములుకావు. అవి ఆత్మనాయక ములు, అంతర ప్రవృత్తి ప్రధానములను. కనుకనే హెగెల్ "While the metrical form also counts" అని గేయ త్వమునకప్రాధాన్యము కల్పించినాడు.

Jonfroy పండితుండు "Lyrical Poetry was only another name for poetry itself" అని చెప్పి నాడు. కవిత్వమునకే లిరిక్కు అని నామాంతరముంట కవిత్వ మంతయుఁ గవికి స్వీయమే. సృష్టిలో సృష్టికర్త యెట్లు సర్వత్ర విస్తరిల్లి యుండునో యట్లే కవికావ్యమునందు సర్వత్రనిండి యుండును. కవి పలికెడి ప్రతిపదమును, వర్ణించెడు ప్రతి యంశమును, కవిలోనుండి పుట్టినదే. ఇంతవఱకు మాత్రమే

కవిత్వమంతయుఁ గవికి స్వీయము. రామాయణము కావ్యముగా "సృష్టి" యయినంతవఱకే యది వాల్మీకి మహాకవికి స్వీయము. అందలికథ వాల్మీకిదికాదు. రాముని వృత్తాంతము గాని, రావణవృత్తాంతముగాని వాల్మీకికి స్వీయమని చెప్పుట యెట్లు? కథయందలి యుదాత్త లక్షణములను మాత్రమే కవికారోపింపఁగలుగుదుము. వస్తుకవిత్వమునందు గవి యుల్లె పాత్రల చాటునుండి దృశ్యాదృశ్యరూపమున గోచరించుచుండును. భావకవితలో మాత్రము ప్రత్యక్షముగా గన్పడును. భావకవిత్వమునందలి ప్రతిసూక్ష్మాంశమును కవికి స్వీయము. రామాయణము వాల్మీకిభావనయే కాని భావముకాదు.

పురాణము, ప్రబంధము, నాటకము, మున్నగు వస్తు కవితలోఁ బాఠకునకుఁ బాత్రతో సానుభూతి యుండును. భావకవిత్వమునందు గవితో సానుభూతి యుండును వస్తు కవిత్వమునందు సైతము కవి తన పాత్రలతో సానుభూతి పొందును. కనుక పాత్రతో సానుభూతి పొందెడి పఠిత, కవితోఁ గూడఁ బొందుచున్నట్లే మనము భావింపవచ్చును. గాని యిక్కడ కవి, పఠితల సానుభూతి పరోక్షము. ఎక్కడ పఠిత, కవితోఁ బ్రత్యక్షముగా సానుభూతి పొందుచున్నాఁడో యదిభావ కవిత్వమని మనము నిర్ణయించుకొనవచ్చు.

కవిత్వమనను భావకత్వమనను నొకటే యని వాదించు Jonfroy మహాశయునకు, భావములేనిదే కవిత్వములేదు కనుక కవిత్వమనిన భావకత్వమనినను

నొక్కటేయని వాదించు పండితులకును దృష్టిభేదమును వాద భేదమునున్నను ప్రయోజనమొక్కటే. కాని విద్యమానమైన కవిత్వరాశియంతయు నొక్క జాతిలోఁ జేర్పఁదగినదిగా లేదు. తిక్కన భారతము, పోతన భాగవతము ధూర్జటి కాళహస్తీశ్వర శతకము నొక్క జాతిలోఁ జేరగలవా? కనుక "Where individual inspiration is strong, we see Lyrical Poetry in Drama and Epic also" కవియొక్క స్వీయ ప్రవృత్తికిఁ బ్రాధాన్యము వచ్చినచోట Lyrical Poetry ఉత్పన్నమగును. ఇటువంటి ఘట్టములు పురాణములందుఁ, ప్రబంధములందు, నాటకములందు నుండవచ్చును. ఇది Lyrical Part of that Poem మాత్రమే, లిరిక్కు కాదు. భావ కవితాతుల్యము, భావకవిత్వము మాత్రముకాదు. ఈ దృష్టితోడనే శ్రీపింగళి లక్ష్మీకాంత కవిగారు ఆంధ్రభాగవతము విశేషించి Lyrical రచనయని యొక యుపన్యాసములోఁ జెప్పినారు. గజేంద్రునియందుఁ బ్రహ్లాదునియందు, గోపికల యందు పోతన భాగవతమున సర్వత్రవిస్తరిల్లినాఁడు. వస్తు కవిత్వమునందువలెఁ బరోక్షముగను, భావకవిత్వమునందువలె బ్రత్యక్షముగను గాక, ప్రచ్ఛన్నముగా గోచరించుచున్నాఁడు. గజేంద్రుని దీనాలాపములు పోతన కవివి. గజేంద్రుఁడు కేవల మాచ్ఛాదనము. సంజయకృష్ణులరాయబారములు తిక్కనికవివి. ఆ పాత్రలు కేవలమాచ్ఛాదనములు, ఇది భావకవితాతుల్యమే కాని భావ కవిత్వముకాదు. ఆయాచ్ఛాదనములఁ దొలఁగించిన మొదల నది చక్కని భావకవిత్వమగును. కనుకనే "The

Lyric has the function of revealing interms of pure art. Pure Art అనఁగా శుద్ధమైన కళ. దీని నుదాహరణ పూర్వకముగా నిరూపింపవలయును.

"ఇంతేనా ఇంతేనా సౌఖ్యం
బీజన్మకు నిఁక సింతేనా?
సుంతయైన దయలేదా? దేవా!
యెంతకాలమిటు లోపికబట్టెద?
అకటా! నా జీవనదంబిదియో
మడవుల గుట్టలబడిపాఱున్?"

(బసవరాజు అప్పారావు)

అని నగ్నముగా ననాచ్ఛాదితముగాఁ దనహృదయ వేదనసర్వేశ్వరుని మ్రోల మెలుంగెత్తి నివేదించుకొనుచున్నాఁడు భావకవి. ఇది శుద్ధ కవిత్వము. ఇట్టియావేదననే పోతన గజేంద్రు నడ్డు పెట్టుకొని వెలిపుచ్చినాఁడు. "లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె........." దీనిని ప్రచ్ఛన్న లేక ప్రయుక్త (Applied) కవిత్వమనవచ్చును: భావకవిత్వము శుద్ధకవిత్వము. (Pure Art)

పోతన గజేంద్రవిలాపము ద్రాక్షాఫలగుచ్ఛము. అప్పారాయని గీతము ద్రాక్షాసవము.

ఇఁక 'భావకవిత్వ' మను పదముయొక్క సమర్థత విచారింపవలయును. ఇదియే సమాసము? ఈ ప్రశ్నకు సరి

మైన సమాధానము చెప్పినవారు లేరు. కాఁగా నిది యేసమాసమునుగాని దుష్టముముగాఁ దేల్చినారు. సానుభూతియున్న కొందఱు శాకపార్థివాదులవలె నిది మధ్యమపదలోప సమాసమనియు, భావప్రధానమయినకవిత్వముగనుక భావకవిత్వమనియుఁ జెప్పుచున్నారు. సమర్థములగుపదము లేక పదంబగుటయే సమాసముకదా! ఈ భావ—కవిత్వపదాలసంబంధ మపూర్వము. ఈ రెండింటిసంయోగమువలన నుద్దిష్టప్రయోజనము సిద్ధించుచున్నపుడిదియే సమాసమనే వివాదము నిరర్థకమని యితివాదులు పలుకుచున్నారు. ఇదికాక,

"నింగిముట్టియున్న జంగమ నుల్లయ, వసమునందుఁగనిన వస్తుకవిత" అనినన్నె చోడమహాకవి "వస్తుకవిత" అను పదమును బ్రయోగించినాఁడు. వస్తుప్రధానమయిన కవిత్వము వస్తుకవిత్వమనుకొన్నచో నాపద మేనమాసమగునో భావకవిత్వముగూడ నదేసమాసము. భావకవిత్వమును సూత్రప్రాయముగా నిర్వచింప యత్నించిన వారిలో శ్రీ కవికొండల వెంకటరావుగారు ♦ ప్రధములు; ముఖ్యులు.

("భావముయొక్క కవితాస్వభావము భావకవిత్వము" ఇది వెంకటరావుగారి నిర్వచనము. దీనిమీఁద "ప్రబుద్ధాంధ్ర సంపాదకులు వ్యాఖ్యానము చేయుచు నీనిర్వచనము సంస్కృత మర్యాదల కతీతముగా నున్నదనియు, నీపదమపభ్రంశమనియు

పెద్ద లెవ్వరును దీని నంగీకరించరనియు నేమేమో యాక్షేపణలు వ్రాసినారు. కాని వారీ కవిత్వమును గుఱించిగాని, యీ పద మును గుఱించిగాని లోఁతుగా విచారించినవారుకాదు. వెంకట రావుగారి నిర్వచనమత్యుత్తమ మైనది. వివరణలో మాత్రము పొరపడినారు. భావకవిత్వమునకు భిన్నమైనది భాషాకవిత్వ మనియు, దానినే పూర్వులారాధించినారనియు వ్రాయుటఁ బట్టి శ్రీ వెంకటరావు గారికే తమనిర్వచనము లోఁతు తెలియ నట్లున్నది.

"......కవిత్వమనే ధర్మం పైకి కనిపించే యోగ్యం కావ డంతోనే అది రెండురూపాలు తాలుస్తూంది. ఒకటి బాహ్యేం ద్రియగోచరమైన పలుకుబడి స్వరూపమున్నూ, రెండు అంత ర్వాహినిగ హృదయము నర్థముగావించు భావ స్వరూపమున్నూ తాలుస్తూంవుంది."

"కాబట్టి భావకవీ. భాషకవీ, అనేముక్కలు విడిచి పెట్టి———" శ్రీ వెంకటరావుగారి సవరణలో నీ వాక్యా లాయువుపట్టులు. అత్యద్భుతమైన నిర్వచనముఁ జేసియు వివరిం చుటలోఁ బొరపడినారు. ఈ నిర్వచనమునకు నా వివరణ పద్ధతి మనవి చేయుచు నొక సవరణనుగూడఁ జేయుచున్నాను. ఉపో ద్ఘాతముగాఁ జిన్నిప్రసంగాంతర మవసరము. కవిత్వమును గుఱించి వంచిరు, రచించు, నిర్మించు అనెడిపదములు చిర కాలమునుండియు నాంధ్రకవులు వాడుచున్నారు. ప్రజలుకూడ

వాడుకలోఁ గవిత్వము చెప్పుట, వ్రాయుట, కట్టుట అని యనుచున్నారు. వీన్నిలో "వచించు" సంగీతపరముగను "రచించు" చిత్రలేఖనపరముగను, 'నిర్మించును' శిల్పపరముగ, కవిత్వము నకు సంక్రమించినవని నాయాలంపు. అనఁగాఁ గవిత్వ మందలి సంగీత చిత్రలేఖన శిల్పాంశలకు సంబంధించిన వీ పదములు. వివరములు పేజే ముందు వివరింపఁబడును కవిత్వమునకుఁ బద్యమని ప్రతిమనుష్యుఁడు చెప్పఁగలడు. లేఖనసాధనములు లేనప్పుడు పద్యాలు చెప్పఁబడెడివి; తరు వాత వ్రాయఁబడినవి. ఛందోనియామాలు బహుళముగాఁ బెరిగినప్పుడు నిర్మింపఁబడినవి. సృష్టిలో మానవుని సాధనలోఁ గూడ సంగీతమే ముందు—తరువాత చిత్రలేఖనము— స్వరూపసౌష్ఠవముగల శిల్పము చివర. ఇన్నిటికంటె ముందు మానవుఁడు కవి. ప్రాకృతజన్మసంస్కారవశమున నతనిలో జనించిన కవిత్వమే సంగీతముగాఁ, జిత్రలేఖనముగా, శిల్పముగా వ్యక్తమగుచున్నది.

కావ్యము లేక కవిత్వము వచింపఁబడుటకు, రచింప బడుటకు నిర్మింపఁబడుటకు ముందుగాఁ జేయఁబడవలెను. 'కవేఃకర్మకావ్యమ్' కవి చేయుచున్న పని కావ్య మనఁ బడును. "కవేర్భావః కవిత్వమ్" కవియొక్క భావము—

తత్త్వము-కవిత్వము. కవిత్వముయొక్క యీ "చేయఁబడుట" యెట్టిదో సోదాహరణగా వివరించెదను.

సర్వావకాశములు నిండి మనల నావరించియున్న యనంత ప్రకృతిని మనము నిత్యము చూచుచునేయున్నాము. దానిలోమన కేవియు విశేషము కనుపించుటలేదు. అది మనల నాకర్షింపలేదు. కాని యాదే ప్రకృతి కవిలోఁ బ్రవేశించి యతని మహాత్త్వము (Personality) లో శాలితమై తిరిగి కావ్య రూపమున సాక్షాత్కరించినపుడు దానికేదో యొక కొత్త తేజము, కొత్త శక్తి, క్రొత్తఆకర్షణ. క్రొత్త పరమార్థము కలిగినవి. అప్పుడది మనల నాకర్షించినది. మొదట మనము చూచినది ప్రకృతియొక్క ప్రకృతిత్వము. ఇది లౌకికము. కవిలోఁ బ్రవేశించిన ప్రకృతి తనభావమును గోలుపోయి కవి భావమును బొందుచున్నది. అనఁగాఁ గవిత్వమగుచున్నది. ఈ కవిత్వమును జేయుచున్నాఁడు కవి. కళకును శాస్త్రము నకును నదే భేదము. (Bacon) మహాశయుఁ డీక్రిందివిధముగా జెప్పినాడు. "While Science is a subjecting of the mind to things, Art is a subjecting of things to the mind" శాస్త్రమునందు వస్తువు తన తత్త్వమును మనస్సున కెక్కించును. కళలో మనస్సు తన తత్త్వమును వస్తువున కెక్కించును. మన వారుకూడ నీ విషయమునే

"యథాస్మైరోచతే విశ్వంతథేదం పరివర్తతే" అని పలికినారు కనుక వస్తువునకు వస్తుభావమును. కవితాభావమును నని రెండు భావములున్నట్లు తెలియుచున్నది. అందులో వస్తువు యొక్క కవితాభావము వస్తువుయొక్క "కవిత్వము" అనినచో వస్తుకవిత్వము. ఇట్లే భావమునకుగూడ రెండు తత్వాలు—భావత్వమును కవిత్వమును నున్నవి. అందులో భావముయొక్క కవిత్వము భావకవిత్వము. లోకమునందు శోకమనే భావమున్నది. లౌకికమైనంత వఱకు దానికి శోకత్వమేస్థితి అదే కవిలోఁ బ్రవేశించి కావ్యరూపాన బయటికివచ్చి నప్పుడు దానికిఁ గవిత్వస్థితి కలిగినది. అప్పుడది రసమై "కరుణము" అనిపించుకొనును. అనఁగా వస్తు భావభేదాలచేతఁ గవిత్వము స్థూలముగా రెండుజాతులు—వస్తుకవిత్వము—భావకవిత్వము. ప్రతి శిల్పమున కీభేదమున్నది.

ఈ నిర్వచన వివరణమును బట్టి యీ పదము షష్ఠి తత్పురుష సమాసము. భావముయొక్క కవితాభావము భావకవిత్వము.



# తెనుగు భాష

ఆచార్య శ్రీ గంటి జోగి సోమయాజి.

---

## ప్రాచీన స్థితి

సుమారు రెండువేల సంవత్సరములకు ముందు అరవ కన్నడములతో నభిన్నమయి యల్పభేదముతో నుండిన రూపమున మహేంద్రగిరినుండి మదరాసువరకు నున్న భూభాగమున దైనిక వ్యవహారముననుండినది. అల్పసంఖ్యాకములయిన పదములు గలిగి జనసామాన్యమునకు మాత్రముపయోగపడుచున్నది. వైజ్ఞానిక మత రాజకీయాద్యున్నతోపయోగములకు విశిష్టులు వాడుచుండిన సంస్కృతప్రాకృత మహావృక్షముల ఛాయను బడి యినాలోకయోగము లేకుండినది. కాలగతిని ప్రాకృతము నిరాకృతము కాగా. సంస్కృతము గ్రంథసత్కృతికి మాత్రమే పాత్రమై నప్పుడు చాళుక్య రాజదృష్టిపడి ప్రకాశింపదొడంగినది. కాని సంస్కృతికాంతియే దీనికి మూలము. అప్పటి నుండియుఁ గొంచముగా పెరిగి దేశీయులయు, జనసామాన్యముయొక్కయు నాదరణమునను, అవలంబనముననను నేటి రూపము నందినది. కానియీ భాష కెప్పుడును ప్రబలమయిన యన్యభాషాప్రాధాన్యమే యభివృద్ధి కాటంకమయినదను నభిప్రాయములో కొంత

సత్యము లేకపోలేదు. మొదట ప్రాకృతమునకే ప్రాధాన్యము తరువాత సంస్కృతమునకు సత్కృతి. ఆ తరువాత తురుష్కులు రాజ్యకాలమున అరబీ పారశీక భాషల యాధాన్యత్వ మును వ్యాప్తియు దేశముననుండినవి. రాజావలంబనము దానికే. పఠనపాఠనములును ముఖ్యవ్యవహారమును ఉర్దూ పరిషియను భాషలకే తురుష్క ప్రభువులవలన జరుగుచుండినవి తరువాత బ్రిటిషు పరిపాలనము. 1835 సంవత్సరమున ఆంగ్లమేదశమున నధికారభావయు విద్యావ్యాపక సాధనము నయినప్పటినుండియును గృషియుగౌరవమును నాంగ్లమునకే. నేటికిని అదే పరిస్థితి.

రాజావలంబనమును, ముఖ్యవ్యవహారమును, నాగరిక జనుల వైజ్ఞానిక వ్యవహారమును ఆంధ్రదేశమున నాటినుండి నేటివఱకును అన్యభాషలనే యాశ్రయించుటవలన తెను గెప్పుడును అప్రధానముగానే యుండినది. అట్లనుటవలన తెనుగుపయిని దేశమున నభిమానము లేకపోలేదు సామాన్య జనుల కది తల్లి. దేశీయులయిన చిన్నచిన్న ప్రభువులును రసికపండితు లయిన రాజులును దాని నాదరించుచునే యుండిరి. కావుననే ఆయాభాషలను జీర్ణించుకొని నేటి కీ స్వరూపమున నున్నది. ప్రాచీనకాలమున సంస్కృత పండితు లకును, అంతకుముందు ప్రాకృతాభిమానులకును, నేండాంగ్ల విద్యానవద్యులును పాశ్చాత్య విజ్ఞా నరసామోదులు నయిన

పండిత ప్రభువులకును ఈ భాష యుపసర్జన మాత్రమేయనుట గుండెపై చేతినిడి పరిశీలించుకొను తెనుగువారి కెల్లరకును తెల్లము కాకుండదు ఇది ప్రాచీన చరిత్రము—నేటి స్థితి మాఱినది. ప్రజాభిప్రాయము స్థిర పడుటవలన ప్రజా స్వామ్యము గమ్యమయిన ప్రభుత్వ విధానమున నెలకొనుట వలన (దేశభాష) తెనుగు మొదటి భాష యగుచున్నది. వైజ్ఞానిక వ్యవహారమునకు గ్రమక్రమముగ వచ్చుచున్నది. తెనుగు బాలురందరును తెనుగులో నే విద్య నేర్చు చున్నారు. భావికాలమున నభివృద్ధి కలుగ గలదని తోచుచున్నది.

## నేటి భాషాస్థితి

ప్రస్తుతము పరిశీలింప వలసిన విషయములు రెండు. మొదటిది పాశ్చాత్య విజ్ఞానమునగలిగిన శాస్త్రవాఙ్మయము నెట్లు తెనుగునకు తెచ్చుట. తెనుగునకు తీసికొనరాక తప్పదను ప్రజా శాసనమును పాలకులును. పండితులును ఇష్టమున్నను లేకున్నను అంగీకరింపక తప్పదు. అట్లు చేయుటలో ఆంగ్లపదములను అట్లే గ్రహింపవలయునా లేక తెనిగింపవలయునా. సంస్కృతీకరించి సంస్కృతనమములుగా తెచ్చుకొనవలయునా యనుటయే సమస్య. ఆంగ్లసమముల నట్లే తెచ్చుకొన్నచో ఆంగ్లభాషాజ్ఞానము ఆంధ్రునకు

అనివార్యమయిన యవసరము గలదియగును. సంస్కృతము నంతటిని తెనుగు తనలో జీర్ణించుకొనుటవలన తెనుగు పండితు డనగా, సంస్కృత పండితుడు తెనుగుచే సంస్కృతుడగుటయే యనుట. అట్లుగాని వానికి తెనుగు మాత్రము వచ్చిన వానికి సంస్కృత పదములలోని చిక్కులు సంస్కృత శాస్త్రములలోని భావజాలము, మిక్కిలి దూరమయి శ్రమ తప్పుటలేదని మనము చూచుచునే యున్నాము. అట్లే ఆంగ్ల పదములు వేనవేలు తెనుగునకుఁ దెచ్చుకొనిచో ప్రకృతి ప్రత్యయ విభాగము తెలియక కేవల సజ్ఞామాత్రములుగ నట్టి పదములను వాడుకొనవలసిన వచ్చుచుండును. అట్లు తీసికొని రాకున్నచో తెలుగుపదములు గాని సంస్కృత పదములు గాని కల్పించినచో నవి కృతకములయి శక్తి వెంటనే యేర్పడక అంతర్జాతీయ విజ్ఞాన ప్రవాహమునకు ఈ పదములు మార్గదర్శకములు గాక దేశీయులు తబ్బిబ్బు పడవచ్చును. తెనుగు సంస్కృతమయ మయినది. అదియేదాని కఠినతకు హేతువు" అనునట్టి కొంఁదఱనుండి "తెనుగు ఆంగ్లమయము గూడ నయినది, మఱింత కఠినతకు హేతువు అను" నుడిగా మాఱిపోవలసిన కాలము నున్నది. ఈసమస్యను పూరించుట విజ్ఞులపని. పయికి గనుపట్టునంతటి కష్టమైనదిగా దిది. వ్యవహారవశమున గాలక్రమమున మార్గము సులభమయి పదములు పరచితములగును. పరిశ్రమవలన పాఠకులకు

పరిపాటి యగును. అభ్యాసమే యవకాశములను గల్పించును.

ఏది యెట్లయినను దేశభాషలోనే ముఖ్యవ్యవహారము జరుగుట ప్రజల హక్కు. అది స్థాపనకాక తప్పదు. దానిలోనే యోచన జరుగును. రచన పెరుగును అన్య భాషయు అన్య నాగరికతయు సూర్గదర్శకములుగా నున్నంతకాలము, పరపరిపాలనము నందువలెనే జనుల వైజ్ఞానిక తనువులు నగలనోగలక తప్పదు. కారణ మూహించుట సులభము. పరభాషకును అనాగరకతకును కేంద్రస్థానములును ప్రబోధక నాడీచలనమును మనకు దూరస్థములై యుండును. వ్యవహారమును ప్రచారమును ఇక్కడజరుగును. దృష్టి యావైపుననే యుండుటచేత భావ స్వాతంత్ర్యము లేదు. అన్యభాషా పరిచయమునకును అందలి వాక్యసౌష్ఠవ సంపాదనమునకు, అందలి భావచమత్కృతిం బొందుటకును ఆవేశముతో ప్రయత్నము జరుగును గౌరవము తగ్గును. ఏవైన దేశీయులు క్రొత్తవిషయములు గనిపెట్టినచో నవి యందే యుండును. నిరంతరముగ స్వపరభావము దుర్భర మగుచుండును. దేశభాషలో స్వతంత్రయోజన సులభము. శృంఖలితము గాదు. భారతదేశమునకు ఖ్యాతి దెచ్చిన దని మనము గౌరవించు గీతాంజలి దేశభాషలోనే యా మహానుభావునిచే వ్రాయబడి యన్నె కెక్కినది. తెనుగు గావుననే

వేమన యస్మృశమువంటి గ్రంథమును వ్రాయగలిగెను. అట్టి ఆంగ్ల కావ్యములనుగాని సంస్కృత విమర్శలను గాని దేశీయులు వ్రాయజాలరను భావముగాదు. ఎవ్వరేని సమర్థులు వ్రాయ వచ్చునేమో గాని శ్రమ యధిక మని మాత్రము చెప్పక తప్పదు. ఇది మహాప్రతిభావంతుల పద్ధతి, కొంచము తక్కువవారిమాట విమర్శింప నవసరము లేదు. వారు దేశభాషలో గొప్ప పని చేయగలుగుదురు. ఈసందర్భమున భాషయనగా పదములు మాత్రమేగావనియు వాక్యరచనా విధానమును వ్యాకరణమును, ప్రత్యయ ప్రయోగము మొదలయినవియు నని గుర్తెఱుంగవలెను. తత్సమపద భూయిష్ఠ మైనను తెలుఁగు తెలుగే, సంస్కృతము అసలే అర్థము కాదు. ఆంగ్లపద భూయిష్ఠమయిన తెలుఁగు ఆంగ్లభాషకంటె సులభ మనుట నిర్వివాదము. కొంతకాలమునకు ఆపదములు తెనుగున ప్రాతపడి పరిపాటియగును. మాది యను భావమేర్పడును. ఆభావముతోనే చుట్టుకొనియున్నది, ఈ జగత్తునందలి సర్వప్రయత్నము; కావున సర్వదా అదియే వాంఛనీయము, ఆంగ్లభాషలో నలవాటుపడిన పండితులు ఆభావను విడిచినచో నెట్లు? అని దిక్కుతోచక దేశభాషాప్రాముఖ్యమునకు వైముఖ్యమును జూపుచున్నారు. సమర్థుడగు తండ్రి యున్నంత

కాలము, నా తరువాత నా కొడుకేమగునో యనితలంచును. కాని తండ్రులు పోకతప్పదు, వారికంటె కొంతైనను కొడుకులు గొప్పవారు కాక తప్పదు. తెలుఁగు భాషకు ప్రాధాన్యము రాకతప్పదు ఆంగ్ల భాషా ప్రచారము వెనుక బడక తప్పదు.

ఈ భాషయొక్క గొప్పతనము భావిని ఈ భాషనాడు వారి ప్రతిభకును, ప్రభావమునకును, నాగరికతకును ఫలితము కాగలదు. అవియున్నతమయినచో నిదియును గొప్పది కాగలదు. మానవుని జీవితము, అనుగ్రహమునకు అతని జాతియొక్క ప్రతిభ, ప్రభావమును మూలస్తంభములు. వానియొక్క కాంతి, సొబగు, ఆకారము, సౌష్ఠవము అనువానినంటిది భాషోన్నతి కాబట్టి వానినిబట్టియే యిది యేర్పడును గావున భావిని తెనుఁగెట్లుండునో యెవ్వరును జెప్పఁజాలరు.

## కర్తవ్యము

నేడు తెనుఁగులోనున్న యింకొకవిశేషమును వివరింపవలయును, గ్రాంథికవ్యావహారికభాషా విషయమిది. 25 లేక 30 సంవత్సరములకుముందు దేశమున గ్రాంధిక భాషకుఁగల ప్రాముఖ్యము నేఁడు లేదు. వార్తాపత్రికలు గ్రాంధికభాషలోనే ప్రచురణ నందుచుండినవి. జనులు చాలమంది యందే వ్రాయుచుండిరి. నేఁడట్టి పద్ధతి పోయినది. వ్యవహార

స్థగాయినపదములు మాండలికరూపములతో ననేకులనేక విధములుగా వాడుచున్నారు. వార్తాపత్రికలు. రేడియోప్రచారము మొదలయిన వన్నియునందే జరుగుచున్నవి. రామమూర్తిపంతులుగారు తమసిద్ధాంతమును ప్రచారమును సేయకముందు పండితులు అసర్వాప్త లక్షణము ననుసరించి కవిప్రయోగములను దిద్దుచుండిరి. సామాన్యుల కెవ్వరికయినను ఇది తప్పా అను ప్రశ్న ఒకొక్క పదప్రయోగమునను వ్రాతవ్రాయుటకు ముందు ఉండినది. అది నేడు చాలమందిలో నశించినది. స్వేచ్ఛగా వ్రాయుట నిరాఘాటముగా ప్రచురించుట అనునవి మంచి విషయములే కాని తలకొకవిధమున వ్రాసి భాషకు మఱల మాండలికత్వావస్థ గల్పించుట సరికాదు. అనగా ప్రామాణిక భాష అఖిలాంధ్రదేశమునకు నొక్కటియే యుండవలయును, అట్టిదానిలోనే యొక్కరీతినే యత్యల్పభేదములతో శిష్టులు వాగ్వ్యవహారమును రచనావ్యవహారమును జరిగించుచుండవలయును. ఉత్తర సర్కారులవారు తమ మాండలికభాషను రచించుచు, దత్తమండలవాసులు తమ భాషలో తాము వ్రాయుచున్నచో నీ రెండు దేశవిభాగములకు గల యైక్యము చెడును. ఒక పత్రిక తెలుఁగొకరీతిని, మరియొక్క పత్రిక తెలుఁగు మఱియొక రీతిని, రేడియోలో ఒకొక్క వ్యక్తి యొకొక్క విధముగను మాట్లాడుచు వ్రాయు

డుండినచో భాషకు వైవిధ్యము తప్పదు. భేదమునుండి అభేదమును, వైషమ్యమును, దొలగించిసామ్యమును గల్పించు నేకరూపమున భాషకు ప్రామాణికవ్యవహారము నంగీకరింప వలయును ఇట్లంగీకరింప వీలులేదు. ఎవరి యిష్టము వారిది అను సిద్ధాంతము నామోదించి యూరకుండినచో భాష వివిధ రూపములతో వివిధజనులు వ్రాయుచుందురు. ఇది ఐక్యము లేని ప్రాచీనావస్థతో సమానము. భాష నేడుమారిపోయి క్రొత్తరూపమును దాల్పవలసిన యవస్థ స్పష్టముగా గనుపట్టు చున్నది. ప్రామాణికమైన నవీనభాషా రూపమును అంగీకరించి జనులెల్ల దద్గానిని వాడవలెను. ఇట్టిపద్ధతి శీఘ్రముగా రాకుండుటకు హేతువు అన్య భాషా ప్రాధాన్యమును, దేశ భాషయొక్క అప్రాధాన్యమును అనక తప్పదు. ఆంధ్రము ముఖ్యవ్యవహారమును బొందినప్పుడు, ప్రభుత్వము ఈ విషయ మున నాదరణ వహించినప్పుడు, దేశమందలి వేనవేలు పట్టభద్రులు, అసంఖ్యాకులయిన న్యాయవాదులు. చక్కని భాషను ఒకేరూపమున మాటాడుచు వ్రాయుచున్నచో భాషకు ఉన్నతస్థితిగలుగును, అట్టి స్థితి భావిని గలుగక తప్పదు. తెలుగునకు వైజ్ఞానిక వ్యవహారమునం ప్రాము ఖ్యము గలుగుచున్నది. ఈవిషయమున శ్రేష్ఠులే మార్గ దర్శకులు గావలయును. సంస్కృత ప్రాకృతములు మూలబడి తెలుగు

నన్నయకాలమున నెట్లు వెలసినదో యట్లే మాటల ఆంగ్లము
మూలబడి తెలుగునకు మంచి రోజులు వచున్నవి. ఏరూప
మున భాషయుండవలయును 'చేయుచు' అని వ్రాయ
వలెనా 'చేస్తూ' అనియా యనునది యల్పవిషయము.
ఏరూపమును వ్రాసినను అభ్యంతరము కలుగదు. భాషకు
ఏకవిధమయిన ప్రామాణికత్వము వెలయవలయును. ఆప్రా
మాణికభాషకే ఒకతీరుననే వ్రాతయు, మాటయు శ్రేష్ఠు
లలోనైన నుండవలయును. అప్పుడు వారినే సామాన్యు
లనుకరించుటచే భాషకు ఉన్నతి కలుగును. మార్పు విషయ
మున భాషాచక్రము వెనుక తిరుగదనియు ముందునకే
పోవుననియును భాషావిదుల యనుభవము. నేటికిని
ముందటికిని తెలుగెట్లుండవలయుననుటలో ప్రయోక్తల
యిచ్ఛయే ప్రమాణము గావున జనులకు నాయకులయిన
వారును, ప్రభుత్వ సమ్మతిని పండితులును, పరిషత్తులును,
దానిని నిర్ణయింపవలయును. ఇది భావికార్యము. ఇట్టి
భావి యవశ్యప్రాప్తవ్యమనుట నిస్సంశయము. ఏదేనొక్క
విధమైన ప్రామాణికభాష ద్వైవిధ్యమంతగా లేనిది నాగరి
కత యొక్క ముఖ్యలక్షణము. ఒకానొకరు చెప్పిన యీ
క్రిందివాక్యములతో నీ వ్యాసమును ముగించుచున్నాను.

" I canot do better than, quote a writer in the New-York 'Round Table' in this connection. He says "The corruptor of a languge stabs

straight at the heart of his country. He commits a crime against every individual of the nation, for he throws poison into a stream from which all must drink. He wrongs himself first and afterwards every man and woman whose native speech he mars. It is the duty of every educated man to guard zealously the purity of his native tongue. He who hunts down and pillories a slang phrase, a vulgarism, a corruption of any kind, is a public benefactor. In the fulfilment of the sacred trust rests on him as an educated man, he adds a stone to the bulwark of his nation's safety and greatness."

భాషాప్రాశస్త్యమును, సంరక్షించుట విద్యాధికుల కర్తవ్యము అనునది పై వాక్యముల యభిప్రాయము. తెలుగు ప్రధమభాషయయి కోర్టులలో రాజకీయ రంగమున, బడులలో ఉపన్యాస వేదికలపయి, ఒక్కతీరున ఏకరూపమున దేశమంతటను వ్రాయుట మాట్లాడుట అనునట్టి స్థితియేయది. దీనికి జనుల యాదరణమే హే[illegible] అది తెనుగునకు లేకపోలేదు.



# 9. సత్యామానిని

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు

---

పురాణ కృష్ణుఁడెటులున్నను ప్రబంధ కృష్ణుఁడు మాత్రము యువతీ పాంచాలుఁడే నరకాసురునిపై దండెత్తి నాఁడు గదా! గెలిచినవాఁడు—పదునాఱువేల భార్యలను గప్పముగాఁ దీసికొన్నాడు ఏరిపాఱవేసిన గవ్వలుగాను, నరకాసుర చక్రవర్తిగారు తెప్పించిన యచ్చరలు; లేఁజవ్వనము పోనిపోని నిగనిగలాడు సొగసుగత్తెలు. నరకాసురుని వంటి రాక్షసుని బారినుండి దప్పివచ్చిన వెనుక వారును సంతోషముతో స్వామికొలువున కొప్పుకొన్నారు. వీరుగాక ప్రత్యేక మెనిమిదిమంది పట్టపురాణులు. "పులుగడిగిన ముత్తెములు", అంతవారికభిమానము దక్కువుండునా? అందఱందరే! సమతాభిమానవతులు. మహత్త్వము, సంపద, వైభవము—వారికేమి తక్కువ? అతని పెద్ద భార్య రుక్మిణి, చిన్న యిల్లాలు సత్యాదేవి. వీరిరువురికిఁ బోటికిపోటికి వీరిద్దఱి నడుమ నలిగిపోయినాఁడా చతురాంతఃపుర వధూప్రసాదన రసికుడు! పోనీలెమ్మని యూరకుండదు ఛాందసురాలు రుక్మిణి తన చేయి క్రిందగుటోర్వదు సత్య. కృష్ణమూర్తి తాళము వేయు కెవరితట్టు. అతఁడు గూఁటిలోనిపిల్లి. పెద్ద భార్య యెదుట వైతాళికుఁడు, చిన్న భార్యకు సేవకుడు. ఎట్లోయొకరీతి నీడ్చుచున్నాఁడు తన యవతారమును. మొత్త

మ పై నందతీసి కలిక మర్దినాడు. ప్రపంచ మన్నది గదా "పాపము! కృష్ణుని కిపువురును రెండు కన్నులు, ఎవరితట్టును బలుకఁడు. ఇరువురిని సమముగ మన్నించు మనస్వి" యని ఇంక రుక్మిణియా! అల్పసంతుష్ట, ఆమెయు "నాకేమి! మగని సూరిమి బిడ్డ కెత్తింతు" నని మురిసిపోయినది. సత్యాదేవి "సర్వవిధముల నాదాసుఁడే యీ పసుల కాపరి" యని పాభి మానము గఁ జాటుకొన్నది. మంచి యుక్తిమంతుఁడే కృష్ణుఁడు కాని కడ కాయన యుపాయమే గళబద్ధమైనది. భార్యలు రచ్చ కెక్కకున్న బ్రతికియుండెడివాఁడే! ఆడువారి నోరును తెప్పెటయు నొకటి. సవసవగా బయలు దేరినవి హేళనములు. ఆత్మస్తుతులు, వెక్కిరింపులు, మండిమాడి కడకు రవరవలకు దిగినవి. పనిలేని దాసురాండ్రు మెల్లఁగ వచ్చి పొంచి వినుట కారంభించినారు. సత్యాదేవిగారు కోపగృహములో గస వ్రాడిపించినారు. కృష్ణమూర్తికి ప్రారంభమైన నగ చాట్లు. ఇది యింత లక్షణముగా నుండఁగా, స్వామివారికే సొంతముగ నొక చాపల్యము కలదు, వారికి సత్యాదేవి యందుఁ గొంచె మక్కువ [illegible]. రుక్మిణిదేవి కొంచెము వయసు తిరిగిన యిల్లాలు. అందులోఁ బురాణకాలము నాటిది, భక్తి, భాగవతసేవ, తులసిపాటలు, కథలు, ఆమెకుఁ గావల సినవి. సత్యగారు నైసర్గికముగా నందతిలోనను రూపవతి. ఆహార్యకము పైఁజాల కృష్టి, విలాసవతులలోఁ బేరుప్రోసి నది రంగురంగుల దుస్తులు, సీతాకోకచిలుకవంటి యొయ్యా

రము. కృష్ణమూర్తికిఁ బూర్తిగా లోఁగొన్నది. ఆమె కటాక్షము పదివేలాయనను సత్యమగనిక్కిఁ గొన్ని నిబంధనము లేర్పాటు చేసినది. కలలోఁగాని నవ్వులకుఁగాని తన మాట జవదాఁటరాదు ఏ పదార్థముఁ దెచ్చినను దొలుతఁ దానిఁటి దేవుఁడు. తన కారగించిపైన తరువాత నందటికి దయాభిక్ష. చెలులు దనతో నేమియు చాడీలు చెప్పరాదు. చెప్పినచో వారిమాటలు నమ్మి ప్రతివాదితరపు వకీలు లేకయే తీర్పు చెప్పునధికార మామె కున్నది. అందుల కతఁడు బద్ధుఁడు గావలసినదే, తన చెవి కెక్కకుండ నతఁడు వారికి లంచాలో గించాలో యిచ్చుకొనవచ్చును. తోడి చేడియలు దనపై వంతుకు వచ్చిన సైరింపరాదు, కృష్ణమూర్తియు నీ నియమములను "తూఁచా" తప్పక యనుసరించు చున్నాడు.

ఒకనాఁడు నారదుఁ డావాహన మైనాడు రుక్మిణి యింటికి. ఈ భాగవతుల కందటికిని ధర్మసత్రమదియేగదా! ఆ వేళకు సరిగఁ గృష్ణమూర్తికి, రుక్మిణిదేవిగారి జనానాలో నేయున్నాడు. ఏకాంతమునఁ గొంతమంది ధవళాంబుజ నేత్రిలతో జూదమాడు చున్నాఁడట. నారదుఁ డక్కడివారందటికినిఁ బరిచితుఁడే. వెంటనే యమ్మగారికిఁ దెలియవచ్చినది నారదాగమనము. జూదము విడిచి యర్ఘ్యము, పాద్యము దీసికొని తయారైనది. విధిలేక కృష్ణుఁడు వెంటబడినాడు భార్యాభర్త లిరువురునుఁ బ్రహ్మమానసపుత్రుని నెదుర్కొన్నారు, సగౌరవముగఁ దెచ్చి, యర్ఘ్యపాద్యము లిచ్చి

యాసనముపై సుఖవిష్టుఁ గావించినారు. ఆ రణభోజనుఁడు మాత్రము సామాన్యుఁడా! కృష్ణుని బోనులో నిలికించి నవ్వులకే దయచేసినాఁ డాతఁడు. కృష్ణునిపై నమస్కార బాణముతోఁ పాటు ప్రార్థనా పద్యములు విసరినాడు. మనుష్యులకే కాదు భగవంతునికిఁ గూడ నున్న దాత్మస్తుతుల కలదు రోగము. తర్వాతఁ గమండలువులో నుండి "పారిజాతంపుఁ గొమ్మనఁ", మిన్నేటి పసిండి నెత్తమ్మి చిగురుటాకునఁ మెదపిఁ "పత్రం పుష్పం ఫలంతోయమ్మని ప్రాణములకుఁ దెచ్చిపెట్టినాఁడు. కృష్ణుడు పరిగ్రహింపనలెనా? లేదా?

కృష్ణుని మనసులోననేక భావములు పొడమినవి. బయటికి మాత్రి మొకటియుఁ గానఁబడలేదు. "వినయంబు విస్మయము" మాత్రము నిలిచినవి. చేతులు చాఁచి ప్రసాద మని స్వీకరించినాఁడు. కాని, దాని నెవ్వరి కీయవలెను? తన బలగ మెంతయన్నది! ఆ కొంటెవారదుఁ డొకటే గిల్లుకొని వచ్చినాఁడు. పదునాఱువేల భార్యల విషయము చింతలేదు. వారాగౌరవ మాసింపరు. తక్కిన పట్టపురాణులకు సమాధాన మెట్లైనను జెప్పుకొనఁగలఁడు. మిగిలిన వారిద్దరు. సత్య కిచ్చిన రుక్మిణిమాటి మూరెడు పొడవగును. రుక్మిణి కిచ్చిన సత్య నిప్పులు గ్రక్కును. రుక్మిణి మెదుకు నున్నది. సత్యలేదు. అయిన నేమి? ఆమె పరిచారక లంతల నింతల నుండరా? పోయి చెప్పినచో గ్రహచారము దప్పినటులే.

చూడుఁ డెటులాలోచించు చున్నాఁడో యా తేలుగుట్టిన దొంగ—

ఇంత జాగ్రత్తగా నాలోచించియు మఱల నాతని కర్మ మేమో మాయఁబోఁబడినాఁడు. రుక్మిణీ యెఱుగా నున్న దే యని యొక ధర్మసందేహము గలిగి తటాలున నామెచేత నైచినాఁడు నారదునికి రొట్టెవిఱిగి నేతిఁబోఁబడినటులైనది. నిజముగా రుక్మిణి యల్పసంతుష్ట. విరి నియ్యఁగున్నను నేమియు ననియుండదా మాయకురాలు!

నారదుఁడు వచ్చినదే కలహముగఁ బెట్టుటకు. అతని కా భాగ్యము పండినది. ఇన్ని దినముల యేకాదశి యీపార ణతో ముగియునని మురిసినాఁడు. తిన్నఁగా మహతి నావలఁ బెట్టి ప్రారంభించినాఁడుసన్యాసమును. "అమ్మా! నీముందర వెలఁదులు పదియేఱు వేలను దిగఁ దుడువనా! కృష్ణుఁడు వారిని జేకొన్నాఁడు గాక; నీకు సఃపోవువా రొక్కరైన నున్నారా" యనునది మొదటి యస్త్రము. వాఁకి నీవు బహిఃప్రాణ మనునది ముఖస్తుతికిఁ బరాకాష్ఠ. ఈ రీతిగ ముఖస్తుతితో నామె నోరుగట్టివేసి తిన్నఁగాఁ దాను దెచ్చిన సరసను గుఱించి పొగడ మొదలిడినాఁడు. అది పరిమళము

సెడనిదఁట. ఎన్నఁడును ఎంత క్రిందుమీఁదైనను వాడదఁట. శుభావహము. ఇంతయేల? జగదేక మనోహరము, అని చెప్పినవి చెప్పనవి యన్నియు నీయూఁకుతో విసరినాఁడు. అంతటిలో విడిచినవాఁడు కాఁడు. అనవసరముగా సత్యా వృత్తాంతమును దెచ్చినాఁడు. ఆతఁడన్నమాటఁ జూడుఁడు.

చక్కనిదానవంచు; నెల
జవ్వనినంచు, జగంబులోనఁ బే
రెక్కినదానవంచు పతి
యెంతయు నా కనురక్తుఁడంచుఁదా
నిక్కుచు విఱ్ఱవీగుచు
గణింపదు కాంతల సత్య యింతకున్
మ్రొక్కక యన్న నీ మహిమ
చూచిన బోటులు విన్నవించినన్.

ఇది యాతని నాటకమునకు ముఖ్యబీజము. ఇంతవరకు హృదయమున దాఁచి యుంచుకొన్నవాఁ డవకాశము దొరికినది వెంటనే యిదే "పదవే"లని వెడలఁ గ్రక్కినాఁడు. బహుశః నారదుఁడు సత్యాదేవి పంపియున్న దాసినిఁ జూచియుండు నేమో; అందులకే యింతగా నొత్తి చెప్పియుండును.

అతఁ డనుకొన్నంత వఱకు జరిగినది. చూచి దాసురాండ్రు వేఱువేఱు దేవేరులకు విన్నవించినారు. స్త్రీ హృదయముగదా! అందును సవతిమచ్చరము ఆడువారి స్వభావమున. వారందఱు వరుసగఁ జిన్నవోయి వన్నెఁ దఱిగినారట, అవును. ఇంతకుఁ జేయునదేమి కలదు? రుక్మిణి పట్టమహిషి. ఆమె యందఱిపై నాజ్ఞ చలాయించును. మఱి యామె యాగౌరవ మితరులకు దక్కనిచ్చునా? ఒకవేళ రుక్మిణి గాదన్నను కృష్ణుఁ డామెను వశుఁడు. ఏమిచేమి చేయవచ్చును? అన లేక అనుభవించలేక, సురిక్కి, కడకు వారే కన్నీరు దుడుచుకొన్నారఁట. యనితర శేముషీవతియు, అనన్యసాధారణ సౌందర్యవిభావిజిత మనోహరయు, మానవతులలో నగ్రతాంబూలముఁ గొన్నదియు, మహనీయ సౌభాగ్యవతియు నైన సత్యాదేవి సైరించునదేనా? ఆమెకుఁ దెలిసినచో మఱల గోపికావల్లభుని బ్రదుకు బండలుపాలుగాదా! ఇంక రుక్మిణిగతి?

సత్యాదేవి యుద్యానవనమున హాయిగఁ జల్లగాలిని సేవించుచున్నది. చంద్రశిలవేదిక—కృతకాద్రి—అంకెలు

వేసి పొంకలేర్చి దిద్దితీర్చిన పూలదేనియ మోటికాలువలు, చెంగలువ పుష్పాళ్ళు! ఇంక చెప్పవలెనా! మన కవులకు సర్వము రమణీయముగా నున్నది. అంతకు మును పే యామెకు మనకవుల సంప్రదాయము ననుసరించి "దక్షిణాంస నయన ప్రకంపములు" జరిగినవట. ఆదు కామె యాశ్రం కించిన ఫలమే మనుకొన్నారు? 'ప్రాణనాథుఁ డొండొక దానితోఁ గూడి, నన్నేమైనఁ గ్రిందుఁ బఱచినాడా' ? నా ప్రసంగ మేమైనఁ నెత్తినాఁడా? యనియో. నిరంతర మూంతని మీఁదనే యామెకన్న. ఇంతలో దాసి వచ్చినది సొక్కుచు సోలుచు అఱచుచు నాట్యకటముతో. ఏమి యీ రగడయనఁగఁ గృష్ణమూర్తిపై నపరాధారోపణము. దాసిమూత్రమేమి సామాన్యముగాఁ జెప్పలేదు సుండీ. తక్కువలు దీర్చినది, వంకలు దిద్దినది, కథను బాగుగఁ బాకమునకు దింపినది. సత్యాదేవిగారికిఁ గావలిసినంత నూరి పోసినది. తప్పు దొరకినఁ జాలునను ఆశ యందరికిఁ గలదు. కాని కృష్ణమూర్తి చేనా మహాపరాధము? అసలు అమ్మగారికి తిట్లు వడ్డించినవాఁడు నారదుఁడు. రుక్మిణీదేవి సంతోషముతో విన్నది. కృష్ణుఁడు అర్ధప్రాణముతోఁ జెవులు మూసికొని నిలఁబడినవాడు మఱెవరికో యిందులో శిక్ష న్యాయముగఁ జెప్పుడు? ఇంత విచార మామె సేయలేదు. నారదునికిఁ గలహాప్రియత్వము స్వభావము. అది లేని దతనికి బూట గడనదు. కనుక తన ఆత్మతృప్తికై రెండుముక్కలాతఁ డల్లును. ఇఁక విన్న రుక్మిణియా ! ఆమె నెందుకన వలెను? రుక్మిణిని నెత్తిపై నెక్కించుకొన్న వాఁడును

కృష్ణుఁడే. రుక్మిణి సత్యదృష్టి కొక పాత్రిణిమాత్రమే. కాని యామెకుఁ దోఁచిన పెద్దయపరాధ మేమన, నారదుఁడు దన్ను నిందించినపుడు "పోని లేవయ్యా" యన లేదఁట కృష్ణుఁడు. ఇది మిగులఁగరాని యపరాధమై యామెను భాధించినది. పాపము! దీనిపైనిది యంతయు ధూర్త గోపాలుని చెయిదమే యని కథ నంతయు నంతలో ననుసంధించుకొన్నది. వ్రేటువడిన యురుగాంగనవలె భీషణహుతాశన కీలవలె "హా" యని లేచినదఁట.

నాకుఁ జూడ సత్యాదేవి భార్యగను, కృష్ణమూర్తి పెనిమిటిగను గానరాదు. సత్యయందు సంపూర్ణమగు ప్రేమ యున్నది. అదినిజము కాని యయ్యదియుత్తమమగు పద్ధతులలో నడువదనిమాత్రమే చెప్పవచ్చినది. కృష్ణుడు దనకుఁ బూర్తిగ లోఁబడిన శృంగార ప్రియుఁడే యనుకొందము. ఆ చాపల్యముచేఁ దనకుఁ గొంత యధికారము నెక్కువగ నిచ్చి యుండవచ్చును. నిజముగఁ దాను గౌరవింపఁదగిన భర్తకదా! అట్టియెడఁ బ్రణయస్వరూపిణి యగు సత్య తన యధికారమునింత వెక్కసముగఁ జెలాయించవచ్చునా? మగనినిఁ బూరి కన్న హీనముగఁ జూచుచున్నదే! ఆమె యమాయికురాలే గావచ్చును. కాని వాచాలత్వము మాత్రము పనికిరాదుగదా! ఇంతేకాదు. ఈ భార్యభర్తలు పారిజాతమునకై స్వర్గలోకమునకు వెళ్లినారు పారిజాత తరువు దీసికొని వచ్చుచుండఁదోవలో ద్వారపాలకు లెదిరించి నారు. కృష్ణమూర్తి మగవాఁడు గదా యని యేమో పెద్ద జేకముతో నుత్తర మియ్యబోయినాఁడు. సత్యభామ యూరక

కుందునా ! "చాలులే ! వారికిఁదగిన సమాధానము నీవే యిత్తువు? నేను లేనా పేతునాగములోఁ బేరు మోసిన దానను, ఊరకుండు" మని వెనుక కీడ్చినది. అక్కడనుండి కొంగు సవరించుచు, నడుము మూతి ముక్కు కనులు త్రిప్పుచు, చేతులు బారలు చాఁచుచు నుత్తర మిచ్చినదట ఆ యుత్తర మెటు లున్నదో చూడుఁడు.

సీ. వినుఁడు సురేశ్వరువనపాలకులు వార్ధిఁ
బొడమిన యీ దివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె. యింద్రుండు నెవ్వఁడు
తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁ గాక
తెక తేర యిది యేమి యొకరిసొమ్మొ?
యిదె నాదువిభునిజే నీవదాద్యనగంబు
నొడిపించుకొని యేగుచున్నదానఁ
బలుకు లేటికిఁ దా వీరపత్ని యేని
మీ శచీదేవి తనదుప్రాణేశుఁడైన
మఘవు నిటుఁ బంపి సత్యభామానిధేయు
వలన మరలంగఁ గొనుఁజెపో వాసితనము

అని శచీదేవిని సవాలునకుఁ బిలిచినది. కృష్ణమూర్తి మఱలఁ బారిజాతము నియ్యఁదలఁచినను సత్యదేవి యీయ నిచ్చునా? ఇఁక నతఁడో! "అన్యథా శరణం నాస్తి" యని యామె పాదములే యాశ్రయించి యుండువాడఁట, ఆమెయే "సత్యభామావిధేయు" డని ఢంకావేసి చాటుకొన్నది. కృష్ణ మూర్తి మానావమానములును, సుఖదుఃఖములును లేని మాసిబొమ్మ గాదుగదా! ఒకసారియైనను మనసు విఱుగ కుండునా!

కృష్ణునికి దాసి వచ్చిపోయిన సమాచారము దెలియ వచ్చినది. అప్పటినుండియు మనసులో 'గిల' ప్రారంభమైనది. నిలిచినచోట నిలువలేఁడు. తనపై నేమేమి కొండెములు గల్పించి చెప్పెనో, సత్యాదేవి యేమన్నదో యెటున్నదో, తానింకఁ బోయిన మాటలాడించునో లేదో, యపరాధ దండన మేమి విధించునో యని వేగి పోయినాఁడు. అతనికి నారదుని సల్లాపములు గాని. రుక్మిణి మొరలుగాని కాబట్ట లేదు. తీరిపోని మనస్తాపముఁ దెచ్చిపెట్టుకొంటినే యని ప్రద్యుమ్న కుమారునితో "ముని చెప్పువిషయముల కూఱ కూకొట్టి కార్యము జరుపరా" యని సత్యాగృహమునకు బయలు దేరినాఁడు.

అమ్మగా రావరకే కోపగృహములోఁ దయారైన వారు ఇంతకు మునపుండిన కలకలము లేదు. దాసీ జనులంద ఱును మూలలలో నక్కినారు. చిలుకలు గోరువంకలు

మ్రాఁగన్ను పెట్టి నిద్రపోవుచున్నవి. వానిని మాటలాడించు వారు లేరు. వీణియలు మూఁగలైనవి. మేడ యంతయుఁ ఖాపము చిన్నవోయినదఁట. చూచిన వెంటనే యర్థము చేసికొన్నాఁడు కృష్ణుడు. ఈదినమేమో పండుగ యున్నదని ముందుకు సాగినాఁడు కోపగృహములోనికి. సత్య బిఱ్ఱుగా ముసుఁగుఁ బెట్టినది. మాసినచీర; విడువాలిక కస్తూరిబొట్టు; భూషణములు ధరింపలేదు; తెలుపుఁగట్టి సలసలనై, వణఁకుచు మూలుఁగు చున్నది. కృష్ణుడు పరిచారిక చేతివీవనను దీసికొని హాయిగా విసరినాడు. అతనిమీఁది పారిజాతపు వాసన నల్దిశలఁ బర్వి, సత్యను రెచ్చఁగొట్టినది. సత్య 'వచ్చినాఁ డపరాధి' యని చూచి చూడనట్లు చూచి, మఱల ద్విగుణీకృత మగు పట్టుదలతో ముసుఁగు బిగించినది. కృష్ణుఁ డట్లు బిగిసి యుండగలఁడా? ఆ మాత్రపుఁ బట్టుదల యున్న నింత రామాయణ మెందుకు? అవకాశ మున్నదని గ్రహించి యే హుమ్మనీ నీల్గినది. అనునయించినవాఁడు సామాన్యముగ నన్నాఁడా? "ఓ సత్యా! నీదయ, నా యదృష్టము. నీవొక నిముసము మాటలాడకున్న నాకు స్వర్గప్రాప్తి దప్పదు. దయచేసి యొక గడగంటి చూపు విసరవే" యని బ్రతిమాలినాఁడు, కడకు "దాసుని తప్పులు దండముతో సరి" యని సాష్టాంగ నమస్కారము జేసినాఁడు. అది యొక నాటకమఁట! తాను సూత్రధారి యఁట! ఎంత నటనమైన నింత యవస్థ దగదు పాప మా మహానుభావునకు. ఇంత మనవి చేసినను దేవిగారి మనసు గరగలేదు. కృష్ణమూర్తి గారి తలకాయ ఫెడీలుమన్నది.

జలజాతాసననాసవాదిసురపూ
జాభాజనంబై తన
ర్చ్ఛ లతాంతాయుధు కన్నతండ్రి శిర మ
చ్చో వామపాదంబునన్
దొలఁగన్ ద్రోచె లతాంగి యట్లగుఁ నా
థు ల్నేరము ల్సేయఁ బే
రలుక ఞ్జెందిన యట్టికాంత లుచిత
వ్యాపారము ల్నేర్తురే !

అంతె యెంతగట్టిగఁ దన్నినదో మన మెఱుఁగము. ఆ యావేశములో నామె సామాన్యముగఁ బోనిచ్చియుండునా? కాలిదెబ్బఁ దినిన కృష్ణుఁడందమా, యవే రెండుపాదములు గట్టిగఁ బట్టుకొని "అమ్మగారు! తమరు చాలా నలసినారు నేను తమకు దాసుఁడుఁగదా! తన్నినను అది నాకు మన్ననయ" అని నేమేమో యన్నాఁడట. నిజముగఁ గృష్ణుఁడు సిగ్గులేని వాఁడు. అందుకే యామెయు నంతటి దర్పముఁ జూపించినది, దెబ్బఁ దినినదేగాక పై నామె నోదార్చువేళకు బ్రహ్మా ప్రీతియు మైనది కృష్ణమూర్తికి. "పసులకాపరీ! వల్లవీకింకరా నాయట్టి భార్య నీ యదృష్టమువలనఁ దక్కినది. నీ యోగ్యతకు నేనువలచుదాన నేనా! పొమ్మనినది. ఇవన్నియు ప్రియాశీర్వాదములే యని యా 'జగన్నాటక సూత్రధారి" తృప్తి పడినాఁడఁట.

ముక్కుతిమ్మన మహాకవి; యసాధారణ మేధావి, కథను నడపుటలో నాతడు చూపించిన సన్నివేశములు, కల్పించిన వర్ణనలు చదివి యానందింపఁదగినవి. ఇతర ప్రబంధములకుఁ బట్టిన చీడపురుగు లెన్నియో దీనికిఁదప్పినవి. చంద్రదూషణము, మలయమారుత మన్మథదూషణాదులు లేవు. అంగాంగవర్ణనలచే సిగ్గువిడిచి పాఠకుల నొప్పించలేదు. కవిత్వము మెఱుపుఁదీఁగె వంటిది. యతిప్రాసములకుఁ బదములు వేయఁడు. పలికిన పదము, చూపిన భావము ప్రతి యొకటియు నత్యంత మనోహరము ప్రకృతి వర్ణనములలో నితఁడు చూపిన నేర్పు వర్చస్సు మనకవులు తపస్సుఁ జేసి సాధింపఁదగ్గవి. సర్వవిధముల నుత్తమకవులలో నొకఁడితఁడు.

సత్యాపాత్రము మాత్రము కొంచెము ముదిరి నసయైనది. ఆ కాలపురసికత కది తార్కాణమైనను బాధలేదు. అటులైన నా యభిరుచి పొరపాటన్నను తప్పుగాదు. నిజముగ సత్యవంటి యాఁడుదే సంఘమున నున్న "గయ్యాళి" యని చీదరించి యుందుము. కావ్యమున నున్నది. కనుక మన కంతగఁదోఁచుటలేదు. ఇంకఁ గొంత స్వభావానుగుణముగఁ జిత్రించియున్న మఱింత బాగుగ రక్తిగట్టి యుండెడిది. "భావాంబరవిధివిస్రితహారిణి"ని నిముసము సేపు గలంచి కన్నులు మూయవచ్చును.

# కుమారదాసుని దశరథుడు

(శ్రీ) టి. వి. యం. అయ్యవారు

---

సంస్కృత సాహిత్య ప్రపంచమున కుమారదాసుడు మహాకవిగ మంచి ప్రశస్తి నందుకొన్న ధన్యుడు. రామాయణేతి వృత్తము నాధారముగ చేసికొని, అతడు రచించిన జానకీహరణము రాజశేఖరునినాటి మహాకవుల స్తోత్రములకు పాత్రమైనది. కాళిదాస మహాకవి రఘువంశము విపుల ప్రచారమున రసికుల నలరించుచుండ, రామగాథను, సరళ మహాకావ్యముగ వ్రాయు సాహసము కుమారదాసునకే చెల్లినది. ఈతని తరువాత రామాయణమును మహా కావ్యముగ వ్రాసినవారెందరో కలరు. కాని వారి కృతులేవియును జానకీహరణముతో పోల్చ నర్హములు కావని ఘంటాపథముగ చెప్పవచ్చును. ప్రవరసేనుని సేతుబంధము (ప్రాకృత కావ్యము) మాత్రము దీని కపవాదము ( Exception ). అంతే. మహాకావ్య నిర్మాతగ కుమారదాసుడు, మాఘ, భారవులకు తుల్యుడు. ఈ విషయ మాతని కావ్యము నామూలచూడము పరిశీలించిన సహృదయులకు విదితము కాకపోదు. ఏవంవిధ ప్రతిభాశాలియగు నీ మహాకవి దేశకాలముల నించుక పరామర్శించి జానకీహరణ గత దశరథపాత్ర చిత్రణమును స్థూలముగ ప్రస్తావించుటయే నా వ్యాసలక్ష్యము.

## దేశ కాలములు

గ్రంథస్థ నిదర్శనములబట్టి యిమ్మహాకవి సింహళ దేశీయుడని చెప్పవలయును. తద్దేశ పరిపాలకుడగుట మరియొక విశేషము. రాజకవి యగు నీతని గురించి యనేక గాథలు సింహళీయులు కొందరు చెప్పుకొందురు. "మహావంశము" కాళిదాస మహాకవితో నితనికిగల సంబంధమును సూచించు నొక కథను పేర్కొన్నది. భోజరాజునకు మనవారంటగట్టిన "కమలే కమలోత్పత్తిః" యను శ్లోకపు కథను కుమారదాసున కది అన్వయింపచేయుచున్నది. కథలో నూత్రిమే భేదమును లేదు. అచ్చట కుమారదాసుడు, ఇచ్చట భోజరాజు తన ప్రాణమిత్రుడగు కాళిదాసు వేశ్యాహతుడు కాగా, సుహృద్వియోగమును భరింపజాలని ఈతడతని చితిపైననే ప్రాణత్యాగము చేసెనట. ఆ సందర్భముననే ఈ మహాకావ్యమును నాశువుగా చెప్పెనని యొక్క ప్రతీతి. సింహళదేశీయ గ్రంథములనేకము లీ సంగతిని ముచ్చటించినవి. కథ మాట యెట్లున్నను కుమారదాసుడు సింహళదేశ సార్వభౌముడనుట కిది తోడ్పడును. దేశమేమైన దేమి? మహాకవుల పరిగణించునప్పుడు కుమారదాసుని మనము మరచిపోలేము.

ఈతని శ్లోకపాదమొకటి వ్యాకరణ మహాభాష్యమున కాన వచ్చుటచే కొందరీతనిని పతంజలికి పూర్వుడని యందురు. అది సరికాదు. సూక్తిముక్తావళిలోని రాజశేఖరుని ప్రశంస దీనికి బాధకముగ నున్నది.

"జానకీహరణం కర్తుం రఘువంశే స్థితే సతి
కవిః కుమారదాసశ్చ రావణశ్చ యది క్షమః"

(సూక్తిముక్తావళి)

రఘువంశానంతరము పుట్టినదని చెప్పుటకు నీ శ్లోకమే ప్రబల దృష్టాంతము. ఛందోబద్ధమగు పతంజలిమునివాక్యమునే కుమారదాసుడు తన శ్లోకమున నదుకుకొనెననుట సముచితమైన తీర్పు. సంస్కృత వాఙ్మయ చరిత్రకారులగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి అభిప్రాయమును నిట్లే యున్నది. ఇంత సందేహమునకు మూలమైన "అయివిజహీంహి దృఢోపగూహనమ్మను నా శ్లోకమును క్షేమేంద్రుడు కూడ తన "ఔచిత్య విచార చర్చ"లో నుపసర్గా చిత్యమునకు వ్యతిరేకోదాహరణముగ నుదాహరించినాడు. కాళిదాసునకు కుమారదాసుడు సమకాలికుడైనను కావచ్చును—లేదా అర్వాచీనుడైన కావచ్చుననుటయే దీని పిండితార్థము ఇంతవరకును శుష్కమైన దేశకాలముల చర్చ సాగినది. ఇక నసలు విషయమును ప్రస్తావింతము. విశ్వామిత్రుని యజ్ఞమునకు మారీచ సుబాహులు పదే పదే విఘ్నమును కల్పించుచుండిరి. విఘ్నధ్వంశ సంభూతుడగు శ్రీరాముని గొంపోయి, తన యజ్ఞమును నిర్విఘ్నము కావించుకొనవలెనని ఆ మహర్షి తలంపు. ఈ యుద్దేశము తోడనే అతడు దశరథునికడకు వచ్చి సవనరక్షకై శ్రీరాముని తనవెంట పంపుమనును. పుత్రవ్యామోహపీడితుడగు దశరథుడు వాగ్దానభంగమునకైన సమ్మతించునుగాని, అకృతాస్త్రుడు కాకపక్షధరుడగు శ్రీరాముని విశ్వామిత్రుని వెంట

పంపుట కంగీకరింపడు. కడకు వశిష్ఠుల ప్రోద్బలమున నెట్లో గుండెరాయి చేసికొని పంపుడు. వాల్మీకమున నీ ఘట్టమంత యును నొక పెద్ద రాద్ధాంతము. విశ్వామిత్రుడు రాముని నడు గును. దశరథుడు వీలుకాదనును. పుత్రవిరహాభీరువగు నా మహారాజునోట వాల్మీకి ఈ వాక్యముల చెప్పించినాడు.

"ఊనషోడశ వర్షోమే రామో రాజీవ లోచనః
న యుద్ధ యోగ్యతా మస్య పశ్యామి సహ తాతైః
ఇయ మక్షౌహిణీ సేనా యస్యాహం పతిరీశ్వరః
అనయా సహితో గత్వా యోద్ధాహం తైర్నిశాచరైః
ఇమే శూరాశ్చ విక్రాంతా భృత్యామేఽస్త్ర విశారదాః
యోగ్యా రక్షోగణైర్యోద్ధుం న రామం నేతు మర్హసి
అహమేవ ధనుష్పాణి ర్గోప్తా సమరమూర్ధని
యావత్ ప్రాణాన్ ధరిష్యామి తావద్యోత్స్యే నిశాచరైః
నిర్విఘ్నా వ్రతచర్యాసా భవిష్యతి సురక్షితా
అహం తత్ర గమిష్యామి న రామం నేతు మర్హసి
... ... ... ... ... ...
విప్రయుక్తోహి రామేణ ముహూర్తమపి నోత్సహే
జీవితుం ముని శార్దూల! న రామం నేతు మర్హసి"

(బాలకాండము 2 వ సర్గము)

వాల్మీకమున ఇంత విపులముగా నడచిన ఈ ఘట్టపు స్వరూప మునే కుమారదాసుడు పూర్తిగ మార్చివేసినాడు. ధర్మార్థ మైన దశరథ విశ్వామిత్రుల సమావేశమును నిజముగా కుమా రదాసుడు మహోదాత్తముగ చిత్రించి మూలగాథకు మెఱు

గులు తీర్చినాడు. అసలతని కావ్యమున విశ్వామిత్రుని ప్రవర్తనమే వేరు. ఎక్కడ లేని నిండుతనమును నతడు ప్రదర్శించును. యథావిధి కుశల ప్రశ్నలైన పిమ్మట నతడు సుబాహు మారీచుల శిక్షకై శ్రీరాముని తన వెంట పంపు మనును. అంతే అంతటితో విశ్వామిత్రుని పనియైనది. అతడు వేరుగా బలవంత మేమియును చేయలేదు. అంతయును దశరథునికే విడచిపెట్టి మౌనముగ నున్నాడు. మూలము నందలి విశ్వామిత్రుని ధోరణి నచ్చకే కుమారదాసు డిట్లు వ్రాసెను. తన కావించిన ఈ మార్పునకు సమర్థన కూడ నాతడే ఇట్లు చేసికొన్నాడు.

నృపతావితి వేదితా పదా
మునినా జోష మభూయ తత్క్షణమ్
మహతాం నకదాచి దర్థనా
గురు నిర్బంధ వినష్ట సౌష్ఠవా—

(జానకీహరణము—చతుర్థసర్గము)

విశ్వామిత్రునంతటివాడు వచ్చి యడుగుట—మహోదారులగు రఘువుల వంశమున పుట్టిన దశరథుడు తొలుత నిత్తునని, చివరకు వీలుపడదనుట—అతడు నిర్బంధము చేయుట కుమారదాసునకు రుచింపలేదు. అందుచేతనే యిట్లు వ్రాసి సమర్థించుకొన్నాడని తోచును. విశ్వామిత్రుని పాత్రనే ఇంత రమ్యముగ తీర్చిన మహాకవి దశరథునకు లోపము చేయునా! విశ్వామిత్రునకు తగినట్లుగనే ప్రవర్తించినాడతడు. శ్రీరాముని ద్విజాశీఃపరిపూతతనుని గావించి యొక్క దినము వ్యవధిలో

పంపినాడు. మూలమునన లె—విశ్వామిత్రుని భ్రూభంగముల కుగాని, వశిష్ఠాదుల హితవాక్యములకుగాని ఇందావ్కారమే లేకపోయినది. మహారాజుగా తన కర్తవ్యమును తాను గుర్తించి దశరథుడిచ్చుట నడచుకొనెను. మహర్షివెంట యజ్ఞ రక్షణకై పోవనున్న తన బహిఃప్రాణమగు శ్రీరాముని అంక మున కూర్చుండ బెట్టుకొని యాతడు కావించిన హితోపదేశ ము—రామదాసుడు దశరథుని కిరీటమున చెక్కిన మహో జ్జ్వలవజ్రము. అది ఇది.

శరణోపగతం న పాతి యో
న భినత్తి ద్విషతాం సమున్నతిమ్
నస బాహు రసాధన క్షమో
నరవ్యాఘ్ర ప్రభవః ప్రరోహకః.
పరకృత్యజడో యశోఽర్జనే
జఠరైక ప్రవణో నిరుత్సుకః
పశురేవబుద్ధై ర్నిగద్యతే
యవసగ్రాస నివృత్తమానసః.
అకృత ద్విషదున్నతిచ్ఛిదః
శ్రిత సంరక్షణ వంధ్య కర్మణః
పురుషస్య నిరర్థకః కరః
కిల కండూయన మాత్ర సార్థకః
అశనే రసనాని దేహినాం
కృతయోగాని ముఖేషు భూరిశః
న వసన్తి తదేషు దుర్లభం

ప్రభుయత్ స్యా దభయం ప్రజల్పితుమ్.
తవ జీవిత సంశయేప్యపి
న పరిత్యాజ్య మిదం కులవ్రతమ్
సులభం ప్రతిజన్మ జీవితం
హృదయం ధర్మరతం హి దుర్లభమ్"

(జానకీ హారణము, చతుర్థసర్గము)

దశరథుని యుపదేశ మిచట సంగ్రహముగా నుదాహరించితిని. దీనిలోని చివరిశ్లోకము ఇక్ష్వాకు కుల సముత్పన్నుడగు దశరథున కెంతయును తగియున్నది. పుత్ర వ్యామోహమును తెగకోసి, ధర్మరక్షణకు బద్ధకంకణుడై, దశరథుడు కేవలము రాజ్యాశ్రమ తపస్వివలె నిచట ప్రవర్తించినాడు. ఇట్లు దశరథుని కుమారదాసుడు చిత్రించుటకు కారణము నాకు చూడ కాళిదాస మహాకవి కృత రఘువంశమును బహువారముల నతడధ్యయన మొనరించుటయే. జనశ్రుతిలోని కాళిదాస, కుమారదాసుల మైత్రిబంధమును జానకీహారణమున కనుపించు రఘువంశ శ్లోకానుకరణములును నా యూహకాధారములు. రఘువంశ వర్ణితులగు నిక్ష్వాకుల మహోదాత్త చరిత్రముల కనురూపముగ, కొంత స్వతంత్రించి, దశరథుని శీలమున కిట్లు కుమారదాసుడు వన్నెల దిద్దెనని చెప్పవచ్చును. రాజకవియగు నాతని వ్యక్తిత్వము కూడ దీనికి కొంతవరకు

హేతు వనిపింపకపోదు. ధర్మబద్ధముగ, ప్రజారంజకముగ సింహళదేశమును పాలించిన మూర్ధాభిషిక్తులలో కుమారదాసు వొకడని యాదేశ గ్రంథములు చెప్పుచున్నవి. తాదృగ్ధర్మాభిరతిగల మహారాజు దశరథు నిట్లు చిత్రించుటలో వింత లేదు. లౌకికదృష్టిలో నీ మార్పు అనుచితమయినను, ధార్మిక దృష్టికిది పరమరమణీయమనుటలో విప్రతిపత్తి యుండదనుకొందును.

(భారతినుండి గృహీతము)

